# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలలు, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0    6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0    6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మనదేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము నాలికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్యశొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయమునుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు

# మార్చి నెలలో విడుదల







వాహినీ చిత్రము

# పెద్దమనుషులు

రచన: డి.వి. నరసరాజు * నిర్మాత-దర్శకుడు: కె.వి. రెడ్డి B.Sc. (HONS)

మనిషికి ప్రాణంకంటె గూడ నీతిప్రధానం!
యీపరమసత్య నిరూపణే యీ చిత్రానికి
ప్రధాన లక్ష్యం!




### చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక చాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨3]  మార్చి 1954  [సంచిక 3

# విషయ సూచిక





---




జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## మద్యపాన నిషేధాన్ని అమలు పరచాలి!

మద్యపాన నిషేధపు రద్దును వ్యతిరేకిస్తూ స్వామి సీతారాం ప్రాయోపవేశం ప్రారంభించారు. ప్రజల ఆరోగ్యసౌభాగ్యాలకు ఆయువుపట్టని నమ్మి జాతీయ సమరంలో చేసినత్యాగాలు మహోన్నతమయినవి. అట్టి త్యాగాలు చేసి మద్యపాన నిషేధచట్టాన్ని సాధించిన ప్రతి జాతీయ వీరునకు యీ చట్టం రద్దుకావడం బాధాకరమే. కాని యీ చట్టపు అమలుపట్ల ప్రజలు ఆసక్తి చూపని పరిస్థితులలో ప్రజలకు శ్రేయోభివృద్ధులు తృప్తికరముగా సమకూరక పోవడం చాల విచార కరము.

మద్యపాన నిషేధచట్టమువలన ప్రభుత్వాదాయము లోపించింది. పోనీ - ప్రజల ఆరోగ్య సౌభాగ్యాలయినా అభివృద్ధిదశలోనున్నచో యీ చట్టం తప్పక అమలులో నుండవలసినదే. కాని ప్రజలే చాటుమాటుగా మద్యాలను తయారుచేసి వ్యక్తిలాభాల నార్జించుచు, త్రాగుతున్నప్పుడు యీ మద్యపాన నిషేధచట్టంయొక్క సదుద్దేశాలు

ఎలా నెరవేరగలవు ? ఏచట్టమైనా ప్రజలు బాధ్యతాయుతంగా సహకరించి తమ జీవిత పురోభివృద్ధికి వినియోగించుకొనుటకు ఆసక్తిచూపిననాడుకాని పటిష్టంగా నమలుజరుగ నేరదు. అది జరుగనినాడు చట్టంయొక్క ఉద్దేశాలు నెరవేరవు ; ప్రజలకు, ప్రభుత్వానికికూడ మేలుజరుగదు. కాబట్టే ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారు మద్యపాన నిషేధాన్ని పటిష్టంగా అమలుజరుపడానికి అవకాశాలులేనప్పుడు ఆ చట్టాన్ని రద్దుపరచుటకు తాను వ్యతిరేకిని కానన్నారు.

ఈ పరిస్థితులలో మద్యపాన నిషేధంవలన తృప్తికరమైన సత్ఫలితాలు సమకూర లేదను విషయం యదార్థమైనది. ఈ చట్టాన్ని రద్దుచేయడంవలన యింతవరకు ఏర్పడినవి ఏవైనా సత్ఫలితాలుంటే బూడిదపాలగునది వాస్తవమే. కాని ప్రజలశ్రేయోభివృద్ధులు సమకూరని పరిస్థితులలో మద్యనిషేధచట్టము అమలు జరుగుటవలన కలిగే లాభంకంటె నష్టమధికము. ప్రజోపయుక్తమగు కార్యక్రమములను, ప్రణాళికల నిర్వహణకు ప్రభుత్వానికి ఆర్థిక వసతులు కావాలి. ప్రజలకు ప్రభుత్వానికి కూడ లాభంలేని యీ చట్టాన్ని రద్దుచెయ్యాలనే కొందరి వాదం బలహీనమయిందికాదు. ప్రభుత్వ ఆదాయంలోపించినా యీ చట్టంమూలంగా ప్రజలు ఆరోగ్య సౌభాగ్యాలతో వర్ధిల్లినచో లోటును భర్తీచేసికొనుటకు ప్రభుత్వము మార్గాల నన్వేషించడము ధర్మము. ప్రభుత్వము నష్టపడి, ప్రజలకు ఆరోగ్య సౌభాగ్యాలు సమకూరని నాడు యీ మద్య నిషేధచట్టం రద్దయి ప్రజోపయోగ కార్యక్రమ నిర్వహణకు అవసరమయిన ఆర్థిక స్తోమతైనా సమకూరడం అత్యవసరము.

ఈ సందర్భమున ప్రజలు తమశ్రేయోభివృద్ధులనే కోరి మద్యపాన నిషేధము పటిష్టంగా నమలు జరుగుటకు సహకరించాలి. స్వామి సీతారాంబోటి జాతీయవాదులు నిరాహారదీక్ష పూనే దానికంటె ప్రజలలో మద్యపాన నిషేధం యొక్క ఆవశ్యకత, ఈ చట్టమమలు జరుగుటవలన సాంఘిక, ఆర్థికపురోభివృద్ధుల అవకాశములను ప్రచారంచేసి మద్యపాన నిషేధము అమలు పట్ల ప్రజల సహకారము ప్రభుత్వమునకు లభ్యమగునట్లు చేయుటమంచిది. ఇదే కార్యక్రమాన్ని మహిళాసంఘాలు తమకుటుంబాల శ్రేయస్సుదృష్ట్యా అనుసరించాలి.



# వయోజన విద్యా మహాసభలు

వయోజన విద్యా కేంద్రము కేవలము విద్యాబోధనా సంస్థగానే యుండకుండా ఒక క్లబ్‌లాగయుండి ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని, కల్పించేటట్లుండి గురుశిష్యుల సంబంధ బాంధవ్యాలు సంతోషదాయకంగా నుండాలి.

కె. యస్. రామస్వామిశాస్త్రి

సంఘశ్రేయస్సు దృష్ట్యా ఆధ్యాత్మికంనుంచి, ఐహికంవరకు అన్నివయోజనవిద్యలో చేర్చబడవలసినదే – అంటే మతవిషయాలతోబాటు రాజకీయ పరిజ్ఞానవ్యాప్తికి వయోజన విద్యాభ్యాసం తోడ్పడాలి. సాంఘిక, రాజకీయ, ఆర్థిక పురోభివృద్ధికి, ప్రజాస్వామ్య సూత్రాల అమలుకు స్త్రీ పురుషులనే విచక్షణలేకుండా విద్యావంతులు కావాలి.

ఆచార్య రంగా

మన హిందూ సంస్కృతి, ఆచారవ్యవహారాల విశిష్టతను, మన భారతరాజ్యాంగములోని స్త్రీ పురుషులకుగల సమాన హక్కులు, బాధ్యతలు, అవకాశముల నర్థము చేసికొనుటకు, బాధ్యతల నిర్వహించుటకు చదువు అత్యవసరము. కాబట్టి విద్యావ్యాప్తికి విశేషంగా కృషిజరుగాలి.

శ్రీమతి నల్లముత్తు రామమూర్తి

తొమ్మిదవ దక్షిణ భారత వయోజన విద్యా మహాసభలు జనవరి 9, 10 తేదీలలో ఆచార్య రంగా గారి అధ్యక్షతన తిరుపతిలో జరిగాయి. మహాసభలో పాల్గొనవచ్చిన ఆంధ్ర ప్రముఖులలో శ్రీ పాతూరు నాగభూషణంగారొకరు.

శ్రీ వేంకటేశ్వర హైస్కూలులో ప్రారంభమయిన మహాసభను ప్రారంభంచేస్తూ మద్రాసు ప్రభుత్వ వయోజనవిద్యా గౌరవోద్యోగి శ్రీ కే. యస్. రామస్వామిశాస్త్రిగారు అనర్గళంగా ఉపన్యసించారు. అందులో వయోజన విద్యా కేంద్రం కేవలం విద్యాబోధన సంస్థగానే ఉండకుండా ఒక విధమైన క్లబ్బులాగావుండి ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కల్పించేట్టుగా ఉండాలనీ, గురుశిష్యులొకరొకరు కలుసుకోడం వారికి సంతోషదాయకంగా ఉండాలిగానీ, విద్యాభ్యాసం విసుకు పుట్టించేట్టుగా ఉండకూడదనీ అన్నారు. మన రాజ్యాంగ చట్టంలోని 45–వ నిబంధన ననుసరించి దేశంలోని ప్రతి స్త్రీకి, పురుషునికి వయోజన విద్యను కోరే హక్కు ఉన్నదనీ–విద్యా, ఉద్యోగమూ, హక్కుల రక్షణా, ఈ మూడూ ప్రజాస్వామ్య వ్యవస్థ ఆశయాలనీ వివరించారు. వయోజన విద్యలేనినాడు ప్రాథమిక విద్య వికాసవంతంకాదనీ, తల్లిదండ్రులు నిరక్షరాస్యులైనప్పుడు పిల్లలలోని విద్యాతృష్ణను అణచివేస్తారనీ చెప్పి, దక్షిణ భారతంలో వయోజన విద్యను జయప్రదం చెయ్యడానికి గత 15 ఏండ్లుగా యీ సంఘం సాగించిన కృషినీ, గత 4 ఏండ్లుగా ప్రకటించిన సారస్వతాన్ని గురించి సమీక్షించారు. ఆధునికమైన అన్ని విషయాలపై వయోజనులకొరకు తగినంత సారస్వతం తయారు కావాలనీ, 10 ఏండ్లలో భారతదేశ జనాభా నూటికి నూరుమంది విద్యావంతులు కావాలనీ కోరారు. మద్రాసు ప్రభుత్వం యీ ఉద్యమవ్యాప్తికి పూనుకోడాన్ని ప్రశంసించి, నూతన ఆంధ్ర

ప్రభుత్వంగూడా యీ జాతీయోద్యమంలో ప్రధాన పాత్ర వహించగలదని ఆశించారు.

'జగమెరిగిన బ్రాహ్మణుడు' శ్రీ ఆచార్య రంగా ఈ మహాసభకు అధ్యక్షత వహించడం అందరికీ సంతోషాన్ని కలిగించింది. వారి వాక్చమత్కృతీ, సమయస్ఫూర్తీ శ్రోతలను గిలిగింతలు పెట్టాయి.

అధ్యక్షులు ఈ ఉద్యమం పుట్టు పూర్వోత్తరాలను తరచి ఆధ్యాత్మికంనుంచి ఐహికంవరకు జీవితానికి సంబంధించిన అన్ని విషయాలు వయోజన విద్యలో చేర్చబడవలసిందేనంటూ వయోజనవిద్యకు మతం చాలా తోడ్పడిందన్నారు. సంఘశ్రేయస్సు దృష్ట్యా రాజకీయాలను గురించి వయోజనులకు తెలియజెప్పాలనీ, ప్రజాస్వామ్యం సంపూర్ణంగా ప్రతిష్ఠింపబడాలంటే స్త్రీ పురుషులందరూ చదువుకోవడం ముఖ్యమనీ, ఈ విషయమై ప్రభుత్వోద్యోగులు శ్రద్ధ వహించాలనీ, ఉపాధ్యాయులను ప్రోత్సహించాలనీ ప్రబోధించారు. వయోజనులను విద్యావంతులనెలా చెయ్యటమనే వివాదాలతో వృధా కాలక్షేపం చెయ్యకుండా విద్యావ్యాప్తికి తీవ్రకృషి చెయ్యాలనీ హెచ్చరించారు. పదేండ్లలో నిరక్షరాస్యత నిర్మూలింపబడాలని ప్రబోధించారు.

10–వ తేదీ మధ్యాహ్నం స్త్రీల శాఖా సమావేశం జరిగింది. తిరుపతి శ్రీ వెంకటేశ్వర స్త్రీల కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి కె. రంగనాయకమ్మ స్వాగతోపన్యాసంచేశారు.

శ్రీమతి నల్లముత్తు రామమూర్తి అధ్యక్షత వహించి సముచితంగా ప్రసంగిస్తూ మన పూర్వాచారవ్యవహారాల విశిష్టతనూ, మన రాజ్యాంగంలో స్త్రీలకు పురుషులతో సమాన హక్కు లివ్వడాన్ని వివరించి స్త్రీలు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించాలంటే చదువుకోడం అవసరమనీ, ఇందుకు తగినకృషి జరగాలనీ అమూల్యమైన సలహాలిచ్చారు.

కార్యవర్గ సమావేశాలలో వివిధ ప్రతినిధులు పాల్గొని చర్చించి సముచిత తీర్మానాలు చేశారు.

* * *

ఈ మహాసభ జయప్రదంగా జరగటానికి ఆహ్వాన సంఘాధ్యక్షులు, దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ చెలికాని అన్నారావు తీసికొన్న శ్రద్ధాసక్తులే కారణమంటే అతిశయోక్తికాదు. వీరి సౌజన్యతా, మధుర ప్రకృతీ, ఆస్తికదృష్టీ అందర్నీ ఆకర్షించాయి. ప్రతినిధులు తిరుమలను, పరిసరాలను సందర్శించడానికి ఏర్పాటులుచేశారు. ధనుర్మాస ఉదయసమయంలో ఏడుకొండల అందాన్నీ, అడుగడుగు దండాలస్వామినీ దర్శించి ప్రతినిధులు ఆనందించారు.

తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర హైస్కూలు, కళాశాల, స్త్రీల కళాశాల, లెప్పర్ కాలనీ, ఆర్ఫనేజీ ఒకటేమిట సర్వమూ శ్రీ వెంకటేశ్వరమయమే.

కొద్దిరోజులలోనే విశ్వవిద్యాలయం, క్షయ ఆస్పత్రి, అంటువ్యాధుల ఆస్పత్రీ ఏర్పడతాయనీ తెలిసింది. స్వామి ధనం ఈ విధంగా సద్వినియోగం కావటం చాలా గొప్ప విషయం.

క్షుద్రమైన రాజకీయాది పదవులతోనూ, మత వర్గాలతోనూ సంబంధంలేకుండా మాతృదేశశ్రేయస్సు దృష్ట్యా ప్రజాసేవకే తమ మహోన్నత జీవితాలను అంకితంచేసే మహా పురుషులు ప్రతిదేశంలోనూ, సర్వకాలాలలోనూ కొందరు ఉంటారు. దేశోన్నతికి ఎల్లప్పుడూ వీరే కారకులు. ఆంధ్ర మహా పురుషుడైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఇలాంటివారే. వీరికి తగిన అనుచరులు శ్రీ గోపాల్, నాగభూషణం, శ్రీనివాసరావు ప్రభృతులు. గ్రంథాలయ, వయోజన విద్యా రంగాల్లో వీరికృషి శ్లాఘనీయమైనదీ, అనితరసాధ్యమైనదీన్నీ.

వయోజనవిద్య అంటే అపహాస్యంచేసే రోజులు గతించాయి. స్వతంత్రం వచ్చినప్పటినుంచీ అన్ని రాష్ట్రాలూ ఈ రంగంలో పనిచేస్తూనే ఉన్నాయి. అన్ని రాష్ట్రాలలోకీ మైసూరు ఎక్కువగా సాధించింది. పదేండ్లలోగా నిజంగానే భారతదేశంలోని వయోజనులందరూ విద్యావంతులౌతారనే ఆశిద్దాం.

చక్రవర్తి రంగస్వామి

# పాకిస్తాను సోదరీమణులకు హైందవ నారీమణుల విజ్ఞప్తి



మన ఉభయ దేశాల చరిత్రలో ప్రస్తుతం ఏర్పడిన క్లిష్ట పరిస్థితులవల్ల ఈ జాబు వ్రాస్తున్నాం. ఇటీవలవరకు మనమంతా ఏక దేశీయులంగా వుండడంవల్ల పాకిస్తాన్ సోదరీమణులతో మాకు దగ్గర బాంధవ్యమున్నది; మనమంతా మొన్నటివరకు ఏక దేశీయులుగా నివసించడమేగాకుండా, భుజాలు కలుపుకొని దేశ స్వాతంత్ర్యానికై అహోరాత్రాలు పోరాడి అపూర్వ త్యాగాలు గావించేం. పర దేశీయులనుండి దాస్య విముక్తి పొందిన నాడుగాని మనకు శాంతి వుండదనీ, మన బిడ్డల్ని చక్కటి జాతీయపౌరులుగా తయారుచేయాలనీకదా మనం స్వరాజ్యం కోరింది. ఎట్టకేలకు 200 సం॥లు తర్వాత బానిసత్వంనుండి విముక్తి పొందేం. ఇప్పుడిప్పుడే స్వేచ్ఛావాయువు పీలుస్తున్నాం. ఈ సమరంలో స్త్రీలుకూడ ఎంతో ధైర్య సాహసాలు-కార్యదీక్ష వ్యక్తపరచేరు.

అందుచేత మన ఉభయదేశాలు ఎంతో స్నేహభావంతో, సహృదయతతో మెలిగిననాడే మన దేశాల పురోభివృద్ధికి దోహద మేర్పడుతుందని హిందూ సోదరీమణులు గ్రహించేరు. మన ఉభయ దేశాల అభివృద్ధికి (ఆర్థిక విషయంలోనైతేనేమి, చారిత్రాత్మికంగానైతేనేమి, సంస్కృతి విషయంలోనైతేనేమి, సర్వవిధాలకూడ) ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. మన ప్రధాన మంత్రుల సంప్రదింపులవల్ల మన యిరుదేశాలమధ్య ఉన్న తగాదాలను సరిదిద్దుకోవచ్చు. అంతేకాని ఇతర దేశాలవారిని పిలుచుకురావడం కొరివితో తలగోకడం ఔతుంది. ఇటీవలవరకు పరరాజన్యులు మనలో అన్యోన్య మనస్పర్థలు పెంచి, కొంపకు పెట్టిన చిచ్చువల్లనేకదా మనమంతా అనేక కష్టాలకు పాల్పడవలసివచ్చింది. ఆ చిచ్చు ఆర్పడానికి ఇంతకాలంపట్టింది! ఆ దావాగ్నిలో ఎంతమంది ఆప్తుల్ని, బిడ్డల్ని, భర్తల్ని కోల్పోయి కుమిలిపోతున్నారు? ఆ చరిత్రనే మళ్ళా చర్విత చరణం చేయవద్దు.

దేశాలమధ్య శాంతి సమరస భావాలు ఏర్పడాలి అంటే యుద్ధమన్న తలంపే చరిత్రలో తుడుచుకుపోవాలి. మీ ప్రభుత్వం అమెరికాను కోరుతున్న మిలటరీ సహాయం విషయం వినేసరికి మాకు వొడలు జలదరించింది. మీరు కోరే యీ మిలటరీ సహాయం మీ దేశాన్ని ఒక యుద్ధరంగంగా మార్చడమేగాక, మీ ప్రజల సుఖజీవనానికే ముప్పు తెస్తుంది. మనమంతాకూడ, మాతృహృదయంలో సర్వకాల సర్వావస్థలయందు మన బిడ్డలు

యురారోగ్యాభివృద్ధిగా వర్థిల్లాలని ప్రార్థిస్తున్నాం. ఇటువంటి సమయంలో మళ్ళ యుద్ధ సన్నాహాలు తలపెట్టకండి. మన స్త్రీలు ఇండియాలోనున్నా, పాకిస్థాన్‌లోనున్నా ఈ మారణయత్నాలు చూస్తూ రూరుకోలేరు. మన పూర్వానుభవాలవల్ల మనకు తెలుసు - పరదేశీయులు తెచ్చిపెట్టే అగచాట్లన్నీను. అందుచేత అమెరికా మిలిటరీ సహాయం పాకిస్థాన్‌కు, హిందూ దేశానికీకూడ ఎటువంటి ప్రమాదాలు తెస్తుందో సువ్యక్తమవుతూనే వుందిగదా!

స్త్రీలు ఎప్పుడూ స్వాభావికంగా యుద్ధమంటే ఏవగించుకుంటారు. దానివల్ల ఎన్ని కోట్ల అమూల్య జీవితాలను ఆహుతి చేయాలో, ఎంత ధనం అనవసరంగా నాశనం చెయ్యాలో వారికి తెలుసు. ఆ ధనమే సద్వినియోగ పరచినట్లయితే ప్రపంచ శాంతి-భద్రతలకు అనేక నూతన పంథాలు నిర్మించవచ్చు. పాకిస్థాన్‌కు సహాయపడతామన్న పెద్దలకు తెలియదు- అచ్చటి స్త్రీలు వాంఛించేది 'వారి బిడ్డలకు కడుపునిండా కూడు - గుడ్డ - విద్య- ఆరోగ్యం-ఆనందం-' అంతేకాని మెషీను గన్నులు - టాంకులు - బాంబులుకాదని! మన రెండు దేశాల్లోనుకూడ సరియైన ఆహారం - వైద్య సహాయం లేక అనేక మంది బిడ్డలు ప్రాణాలు కోల్పోతూ ఉంటే ఆ తల్లులు పొందే గర్భశోకం ఎవరికి తెలుస్తుంది? యుద్ధమే తప్పనిసరియైతే ఎన్నెన్నో క్లిష్టపరిస్థితులకు తట్టుకుని బైటబడ్డ ఆ కొద్దిమంది బిడ్డలుకూడ యుద్ధరంగంలోకి ఈడ్చబడతారు.

అమెరికా మిలిటరీ సహాయంతో పాకిస్థాన్‌లో చక్కటి 'ఇండ్లు-స్కూళ్లు-ఆస్పత్రుల'కు బదులు యుద్ధసన్నాహాలు తయారుచేయవలసివస్తుంది. పాకిస్థాన్ యుద్ధరంగంగా మార్చవద్దని మీ స్త్రీలంతా ఎదురు తిరిగిననాడు మీకు తోడ్పడడానికి మేమంతా సంసిద్ధులుగా వున్నాం. ప్రపంచంలో శాంతి నెలకొల్పిననాడే మనమంతా నిశ్చింతగా జీవించగలం. మన స్త్రీలంతా గట్టిగా సంకల్పించి, యిలాంటి యుద్ధాలరికట్టి, మన భర్తల్ని, బిడ్డల్ని, సోదరుల్ని కాపాడాలి.

స్త్రీలు ఎప్పుడూ దేశ కళ్యాణానికి తోడ్పడేవారేకాని, దేశ వినాశనానికి కారకులు కాకూడదు. అందుచేత మనమంతా ఐక్య కంఠంతో యీ యుద్ధోన్మత్తాన్ని అరికట్టి ప్రపంచ శాంతికి పాటుపడదాం.

ఇట్లు

హైందవ సోదరీమణులు

1-2-54



# వ్యక్తి స్వాతంత్ర్యముకంటె పరస్పర సహకారము మేలు

శ్రీమతి మల్లాది పద్మావతి — శ్రీమతి ఊ. లక్ష్మీకాన్తమ్మ



పద్మావతి:—ఏమండీ లక్ష్మీకాంతమ్మగారు చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నారే ఏదైనా సభలున్నాయేం?

లక్ష్మీకాంతమ్మ:—ఓహో మీరా పద్మావతిగారు. రండి రండి కూర్చోండి. అవునండి మన మహిళా మండలి పక్షాన ఆంధ్ర సాంస్కృతికోత్సవాలు జరపాలని సంకల్పించాము. దానికి కార్యక్రమ మెట్లానా, ఎవరెవరిని కార్యవర్గంలో వేద్దామా అని ఆలోచిస్తూ ఉన్నానండి. మంచి సమయము లోనే మీరూ వచ్చారు. ముందు మీ సలహా తోనే ఈ కార్యక్రమము ప్రారంభిస్తాను.

పద్మా:—ఏమిటండీ ఈ మాత్రం దానికి నలుగురిని చేర్చడం ఆలోచించడం దేనికి? ఈ సమావేశాల కోసం జరిగే కాలహరణం మూలానే చాలా పని ఆటంకం కలుగుతుంది. ఇహ నల్గురుచేరి వాదోప వాదాలు పెంచుకోవడంతో పుణ్యకాలము దాటి పోతుంది. ఏదో తలపెట్టినవారు మీరు, మీ ఒక్క చేతిమీదుగానే పోనిద్దురూ. పరస్పర సహకారం అని ఒక చోట గూడితే ఒకరు ఏటికి, మరొకరు కోటికి ఈడుస్తారు.

లక్ష్మి:—ఏమమ్మోయి మొదట్లోనే చక్కని సలహా చెప్పేవే. సంఘమన్న తర్వాత అందరి ఆలోచన తోటే పనులు చేసికొంటేనే ఏపనైనా జయ ప్రదంగా జరుగుతుందికాని, ఒక్కరి ఆలోచన తోనూ, ఒక్కరి అధ్వర్యంతోనూ ఎన్ని పనులని సంభాళించుకొనగలము? ఎవరి బుర్రల కెలాంటి క్రొత్త క్రొత్త భావాలు తోస్తాయో, అవన్నీ చర్చించుకొని, ఆఖరుకు ఒక ఏర్పాటుకువచ్చి పని నెరవేర్చుకుంటే అందరి ఆమోదము లభిస్తుంది.

పద్మా:—ఆ ఏమిటో మీపిచ్చి అభిప్రాయంకాని, నాలుగు తలకాయలు ఒకచోటచేరి ఒక త్రోవకు వస్తారా? ఎవరి స్వార్థాశయాలు, వారు యీ విధంగా నెరవేర్చుకోవాలనిచూచి అసలు పనిని చెడగొడతారు, కాని పైగా తమ కోరికలు నెర వేరలేదని లేనిపోని తగవులు తెచ్చుకొని ఎడ మొహం పెడమొహం అయి సంస్థకుకూడ చెడ్డ పేరు తెస్తారు. వ్యక్తి యాజమాన్యంక్రిందనున్న కుటుంబాలు చూడండి ఎంత సలక్షణంగా ఉన్నాయో,

లక్ష్మి:—కుటుంబ నిర్వహణ విషయంలో వ్యక్తి యాజ మాన్యం ప్రయోజనకరంగానీ, సంస్థల విషయంలో అదెట్లా కుదురుతుందమ్మా! వాదమూ వివాదమూ నలుగురి అభిప్రాయాలు కలబోసికొని ఒకరినొకరు ఒప్పించుకోడానికి ప్రయత్నంచేసి చెడ్డపద్ధతులను, అసాధ్యములైన మార్గములను వదలివేసి, అందరం కలిసి, ఒకే మార్గం ఆశ్రయిస్తే మనదేశ శ్రేయస్సు ఒనగూడుతుంది. కాని మంచిచెడ్డలు ఆలోచన లేకుండా ఒకరి ఉద్దేశాలు కొనసాగాలంటే అది సంఘమని ఎట్లా అనిపించుకొంటుంది? మనము నిజంగా సంఘక్షేమము కోరినయెడల నలుగురి ఆలోచనలు తప్పక తీసికోవాలిగదా?

పద్మా:—మీరట్లా అంటున్నారుకాని ఇప్పుడు మీరు తలపెట్టిన ఈ సాంస్కృతిక సభలున్నాయే చాల ప్రయోజనకరమైనవిగదా. ఏమిటో కార్యవర్గ మందరూ దేశశ్రేయస్సును మనస్సులో పెట్టుకొని ఈ మీ అభిప్రాయాన్ని ఆమోదిస్తారన్న మాటే మిటి? మీ ఉద్దేశం సదుద్దేశమే అనుకోండి. డబ్బు ఖర్చని అయితేనేమి, హెచ్చుశ్రమకు కారణమైతేనేమి, సాధారణంగా మన భారత

దేశంలో—అందులో స్త్రీ వర్గంలో వ్యాపించియున్న అజ్ఞానంచేతనైతేనేమి, ఇటువంటివి నిర్వహించడం అందరికి ఇష్టముంటుందంటారా? నల్గుర్ని చేర్చి సలహాలడిగితే అడ్డుపుల్లలు వేయడం తప్ప ఇంకేమి పనిజరగదు. అసలు విషయానికే భంగం కలుగుతుంది. కుటుంబంలోనే ఏకయాజమాన్యం సాగుతుందనుకుంటున్నారుకాని మీరు సంఘాలంటే మాత్రం కుటుంబాలు కాదా? అవి విశ్వకుటుంబాలు. కుటుంబాల్లో యజమాని సంకల్పానికి అందరు సహకరించినట్లే, సంఘ కుటుంబాలలోకూడ ఒక వ్యక్తి అధ్వర్యం వహించి తక్కినవారి సహకారం కోరవచ్చును. ఆ పద్ధతిమీద పనులు సాగుతాయికాని, ప్రజాస్వామ్యమని, పరస్పర సహకారం అని పెద్ద పెద్ద సిద్ధాంతాలు పెట్టుకొంటే పనులు సాగవండీ.. మహా మహా రాజ్యాంగ ప్రణాళికలకే ఈ సిద్ధాంతాలు అచరణ దుస్సాధ్యంగా కనబడుతున్నాయి. అసలు పని జరగేలాగ చూద్దురూ.. ఈ సిద్ధాంతాలకేమి?

లక్ష్మి:—సిద్ధాంతాలకొరకు కాదమ్మా.. జరపబోయే పని చాలా ఉత్కృష్టమైనపని కావడంచేత అచరణలో సులభంగా ఉండాలనే నేనూ నలుగురి ఆలోచనలు కోరుతున్నాను. చిన్నకుటుంబాల్లోనే, యజమాని తన ఒక్కడి ఆలోచనతో ఏదైనపని ఆజ్ఞాపిస్తే తక్కినవారు దాన్ని అనుసరించడానికి ఒక్కొక్కప్పుడు ఎంతో బాధపడుతూండడం చూస్తున్నాము. అయినా ఒక్క కుటుంబంతో పరస్పర ప్రేమాను బంధాలుంటాయి కాబట్టి ఏదో వెనకాముందూ సర్దుకుపోతూంటూరు. మఱి సంఘంల్లోకూడ మనపెత్తనమే సాగాలనుకోడం అనుచితంకాదమ్మా, ఒక వ్యక్తి స్వాతంత్ర్యము వహించడమేమిటి? తక్కినవారు అనుసరించడమేమిటి? సంఘీయులు అజ్ఞానంచేత కాదంటే మనయుక్తి, విజ్ఞానము ఉపయోగించి వారందర్నీ మంచిపనుల కొప్పించి, అందరితో పాటే ముందుకు సాగుదాం. ఆ ప్రయత్నాలకు కొంత ఆలస్యం అయితే కావచ్చు. అనుకూలపు సమయానికే వేచియుందాము. మరణానికయినా సంఘ మరణం శ్రేయస్కరం అన్నారు పెద్దలు. అందరితోబాటు సంఘశ్రేయస్సు సాధించడమే విజ్ఞుల కర్తవ్యము.

పద్మ:—మీ సంకల్పము స్వార్థరహితమైనప్పుడు దానివల్లకలిగే ఫలితం మంచిదయినప్పుడు మీకు మరొకరి సహకారంతో అవసరమేమున్నది? మీకు తోచినట్లు మీరు చేయవచ్చు. చేసిన తరువాతనైనా సంఘము మీ పనియొక్క విలువ తెలిసికొంటుందిగదా? ఎట్లైనా శ్రేయస్కరమయిన సదుద్యమము కొనసాగడంకదా మనకుప్రధానం..

లక్ష్మి:—అయ్యో ఒకరివల్ల ఎన్ని పనులు నెరవేరగలవు. ఒకేవిధమైన అభిప్రాయంకలవాళ్లు నలుగురైనా ఒకచోటచేరి సంఘ కార్యాలు, సంస్థల నిర్వహణలు చేస్తే ఫలితం అనుకొన్న దానికంటె హెచ్చుగా సిద్ధిస్తుందికదా.. ఈ ఉద్దేశంతోనే కదా చిన్నవైన సహకార సంస్థలు మొదట పెద్దవైన రాజ్యాంగ ప్రణాళికలవరకు ప్రజాస్వామ్య సిద్ధాంతాలతో నడుపుచున్నారు. ఈ సహకార పద్ధతులవల్ల కలిగేలాభాలు కళ్ళారా చూస్తూకూడ ఎట్లా త్రోసిపారవేయగలము? రైతాంగానికికూడా సహకార సంస్థలుపెట్టి ప్రభుత్వము నడిపించడంలేదటండీ?

పద్మ:—అయితే ఇందులో పూర్తిగా లాభమేకాని నష్టములేదనా మీ ఉద్దేశం? ఈ పద్ధతులలో లోటులెన్ని చూడటంలేదు. పరస్పర సహకార సంస్థల్లోకూడా నిజానికి జరిగేది వ్యక్తిస్వాతంత్ర్యమే. వయోజన వోటింగ్ బెట్టి ప్రజలందరకు సమాన హక్కులివ్వాలని, ప్రజలెన్నుకున్న ప్రతినిధులతో పరిపాలన సాధించాలని అనుకుంటేనే కాదటండీ, మనదేశావసరాలకు అతిముఖ్యమైన ప్రాజక్టులు మొదలైన ఘనకార్యాలు వెనుకబడినవి! పరస్పర సహకారం అని పెద్ద పేర్లు వల్లిస్తూ పార్టీకక్షలు పెంచుకొని, మెజారిటీలు సాధించుకొనే యత్నాల్లో అమూల్యమైన

(162—వ పుట చూడుడు)

# నిడదవోలు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

ఎటుచూసినా సుమారైదారుమైళ్లు వైశాల్యం గల పాటి నేలలతో - పల్లె పట్టులతో కూడుకొని వున్న నేటి నిడదవోలు - పన్నెండవ శతాబ్దిలోనూ - ఆ పిమ్మటా - వరుసగా - 'నిరవద్యపురము', 'నిడుదప్రోలు' అని వ్యవహరింపబడుతూ వుండేది. శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు తమమడ్డుకతలో —

"నిరవద్య పురమను నిడదవోలునకు
మిగుల చెంగటనున్న రావిమెట్ట గ్రామమున"

అన్నారు.

నేడీగ్రామానికి తూర్పున పెద్దమడుగూ- పడమర ఎత్తైన కోటదిబ్బా - దాని పూర్వపు ఔన్నత్యాన్నిప్పటికీ వెల్లడిస్తున్నాయి. అంతేకాదు - దీని చుట్టూగల జలసీమ (జల్లి), బత్తర్ - బహార్ సీమలూ, దండుబాట, దండుకర్రలూ, ద్వారవరం (దారారంగ్రామం - ఇచ్చటే కోట ముఖద్వారం వుండేది అంటారు) రాజధానీ నగర చిహ్నలనకతీరదు. కాగా - కోటదిబ్బలో శివలింగాలూ, శివాలయాలూ, శక్తి విగ్రహాలూ (వీటిలో ఒకదానికి పూజాదికాలిప్పుడు జరుగుతున్నాయి.) మున్నగునవి బయలు పడడాన్ని పట్టి - క్రీ. శ. ౧౨౬౦ లగాయతు ౧౩౨౯ వరకూ పురుషవేషంతో ఆంధ్రమహా సామ్రాజ్యాన్నే కచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించిన కాకతీయ రుద్రమదేవికిది ప్రాంతీయ రాజధానీనగరమైనట్టు స్పష్టమవుతూ వుంది. ఇచ్చటామె చాళుక్య వీరభద్రుని వివాహమాడి రుయ్యాంబను కన్నట్టు కూడా జనశ్రుతి.

కాలవశంవల్ల క్రమక్రమంగా అటుకాకతీయ పరిపాలనా - ఇటు చాళుక్యపరిపాలనా క్షీణదశకు వచ్చాక - దేశంలో అనేక చోట్ల మొహమ్మదీయులు చొరబడ్డారు. అనేక నగరాలు వారి హస్తగతమయ్యాయి. అలాగే నిడదవోలుకూడా అయింది. కొవ్వూరుకు రెండు మైళ్ళ దూరంలో ఔరంగాబాదు, చాగల్లు సమీపంలో మీనా నగరం మున్నగు గ్రామాలు తురక పేరులతో ఇప్పటికీ వుండడమే ఇందుకు తార్కాణ.

అయితే - ఈ నగరాన్ని పట్టుకుని రాచరికం చలాయించిన మొహమ్మదీయు

లెవరో తెలియదుకాని - వీర పరిపాలనా ప్రభావాన్ని వెల్లడించే శ్లోకమొకటి అక్షరాస్యులలో వాడుకలోవుంది—

"విప్రాస్మిన్ నగరే మహాన్ కథయకః ?
తాళ ద్రుమా ణాంగణః,
కోదాతా ? రజకో దదాతి వసనం
ప్రాతర్గృహీత్వానిశి,
కో విద్వాన్ ? పరదార విత్తహరణే
సర్వేపి విద్వత్తమాః,
కస్మా జ్జీవసి హేసఖే !
విషక్రిమి న్యాయేన జీవామ్యహమ్"

కాగా - ఈ నగర పరిపాలకులయిన తురకలు రాతిరి పగలూ - పగలు రాతిరీ చేసి వ్యవహరిస్తూ వుండేవారట ! ఆ కాలంలో ధాన్యాది కొలతలో తగవుపడిన ప్రజకు - కుంచంబోర్లించీ - అడ్డుగా పెట్టీ కొలవవలసిందిగా వారు శాసించారనేటటువంటి గాథలెన్నో ప్రచారంలో వున్నాయి.

అప్పుడొక బ్రాహ్మణుడు భార్యతోనూ, ఇద్దరు పిల్లలతోనూ మార్గవశాత్తూ మధ్యాహ్నానికి ఆ నగరానికి చేరాడట. నగరానికప్పుడర్థరాత్రి కావడం వల్ల గాథ నిద్రలోవుంది. వీథులు నిర్మానుష్యంగా వున్నాయి. పట్టపగలు ఎండ తీవ్రంగా వుంది. కాళ్ళు కాలిపోతున్నాయి. దీపాలు మాత్రం వెలుగుతున్నాయి. బజారులేదు. అందుకు వారు వింతపోతూ వంట సామగ్రికోసం నగరమంతా గాలిస్తూ వున్నారు. దివ్యకాంతలాగు అతిలోక సౌందర్యంతో ప్రకాశిస్తూవున్న ఆబ్రాహ్మణుని భార్య - అంతఃపురంలో పచారు చేస్తూవున్న పాదుషా కంటపడింది. అలా చూసీ చూడగానే అతడామెను తీసుకు రమ్మని భటుల కాజ్ఞాపించాడు.

భటు లావెంటనేపోయి వారిని చుట్టుముట్టారు. బ్రాహ్మణుడా భటుల్ని ఎదుర్కొన్నాడు. అతనితో వారికి చాలాసేపు పోరాటం జరిగింది. ఆ పోరాటంలో భటులెందరో హతమయ్యారు. కాని - భటుల సంఖ్య అధికమైంది. సాయుధ భటులతో నిరాయుధుడైన బ్రాహ్మణ వీరు డెంతకాలం పోరాడగలడు? అలా అలసిపోయిన బ్రాహ్మణుని భటులు పట్టుకుని చింతచెట్టుకు జార్ల వేసి - మేకులు వేసి - కొట్టి చంపారు. ఈ చెట్టు 'వీరుని చింత' అనే పేరుతో చాగల్లుకుపోయే ట్రంకు రోడ్డులోవుంది. ( ఆచింత లేదుగాని దాని స్థానే మరొకచెట్టూ - అక్కడకొన్ని శిలా ప్రతిమలూ ఇప్పటికీ ఉన్నాయి)

అలా మగని మరణం కళ్ళారా కాంచిన ఆ బ్రాహ్మణి - ఆ భటులకు భయపడి పిల్లలను చంకపెట్టుకొని ఇండ్ల పెరటి దొడ్డులలోనుండి గోడలూ గొందెలూ దాటుకుంటూ పోయిపోయి మానభంగం కాకుండా మడుగులో పడి మాయమయింది. అలా మాయమైన ఆమె నేటి గ్రామదేవత.

గ్రామ దేవత నంగాలమ్మ చంకలలో పిల్లలతోటి శిలా ప్రతిమ మడుగు ఒడ్డున పెంకుటి గదిలో మన కవుపిస్తుంది. ఆమెకు దేవాలయ మంటూ లేదు. జాతర సమయాలలో ఆమె ఎవరికో వకరి కావేశించి ఏడవటం తప్పితే ఏమీ చెప్పదు.

మాన సంరక్షణార్థం నంగాలమ్మ మడుగుకు పోయేటప్పుడు గోడల మదుళ్ళకామె చీర తగులుకొని-చాలా ఇబ్బంది కలిగించడంవల్ల - గోడలకు మదుళ్ళుండరాదనీ - తన మగని మరణానికి చింతచెట్టు కారణమైనందున చింతలు కాయకూడదనీ శపించిందట! అలాగే అక్కడి చింత లిప్పటికీ కాయవు; గోడలకు మదుళ్ళుండవు.

ఆపత్కాలంలో నంగాలమ్మను ఆదుకుని - ఆశ్రయమిచ్చి - అవకాశమున్నంత సేపు ఆదరించినవారు - 'వంగా' వారట. వంగావారు కాపులు. ఈ కాపులామెకు పుట్టింటి మర్యాదలన్నీ ఉత్సవసమయాలలో జరుపుతూవుంటారు. అందుకామె సంతోషిస్తూ గ్రామ సంరక్షిణిగావుంది.




శ్రీమతి వడ్డి కృష్ణవేణి

### ఇందలి పాత్రలు

ప్రకాశం - జమీందారు
రమేష్ - జమీందారుకొడుకు
శ్యామల - జమీందారు భార్య
అప్పన్న - జమీందారు బంట్రోతు
రామన్న - పేదవాడు
జ్యోతి - రామన్నకూతురు

### 1-వ రంగం

[జమీందారుగారియిల్లు. కుర్చీలు, బల్లలు, సోఫాలు మొదలగు ఫర్నిచర్ వుంటుంది. జమీందారుగారు ఈజీచైర్‌లో కూర్చుని పేపరు చూస్తూ వుంటారు. అప్పన్న ప్రవేశం]

అప్పన్న:-బాబుగారు మీకోసం రామన్న వచ్చాడండి.

ప్రకాశం:-రామన్నా! అతనెవరు. ఎందుకు వచ్చాడు.

అప్పన్న:-రామన్న చాల బీదవాడండి. ప్రొద్దున అమ్మగారు రమ్మని చెప్పారట.

ప్రకాశం:-సరే రమ్మను.

అప్పన్న:-చిత్తం బాబయ్యా.

[అప్పన్న నిష్క్రమించును]

ప్రకాశం:-శ్యామలా ఇల్లారా - ఎక్కడున్నావు.

[శ్యామల ప్రవేశం]

శ్యామల:-ఎందుకు.

ప్రకాశం:-రామన్న, అనే అతన్ని రమ్మన్నావట ఎందుకు?

శ్యామల:-అతనెవరో నేనెరుగనండే? నాకేం తెలుసు.

ప్రకాశం:-మరి నీవు రమ్మన్నావని చెప్పాడు.

శ్యామల:-నేచెప్పలేదండి. ఎవరు చెప్పారో. పొరపాటున మన ఇంటికి వచ్చివుంటాడు.

ప్రకాశం:-సరే వస్తాడుగా చూద్దాముండు.

[అప్పన్న రామన్నతో ప్రవేశం]

రామన్న:-దండాలండి దొర.

ప్రకాశం:-నిన్ను ఎవరు రమ్మన్నారు? ఎందుకొచ్చావు?

రామన్న:-పొద్దున మా అమ్మాయి ఈ దారివెంట పోతూంటె అమ్మగారు పనిచేసేవాళ్లు కావాలని చెప్పారట. మీకిష్టమయితే మా అమ్మాయి చేస్తుందని చెప్పటకు వచ్చానండి.

ప్రకాశం:-శ్యామలా పనిచేసేవాళ్లు కావాలని చెప్పావటగా - ఇతని కూతురు చేస్తుందట.

శ్యామల:-ఎవరయితే మనకేం. జీతం విషయం మాట్లాడుకొని రమ్మనండి.

ప్రకాశం:-ఏమోయ్ జీతం ఎంత కా వా లో చె ప్పి సాయింత్రంనుంచి రమ్మను.

రామన్న:-ఎంతో కొంత ఇవ్వండిబాబు. మీకు మాత్రం తెలియదా? పెద్దింటిబిడ్డలు. సాయింత్రం మా అమ్మాయిని పంపుతా. ఏంచెయ్యాలో చెప్పి చేయించుకోండి బాబయ్యా, నే వెళ్తున్నా.

ప్రకాశం:-సరేలేవెళ్లు. నెలకు ఎనిమిది రూపాయ లిస్తాము. జాగ్రత్తగా చెయ్యమనిచెప్పు.

రామన్న:-సెలవుబాబు.

[రామన్న నిష్క్రమించును]

2-వ రంగం

[ఒక చిన్నగది. అందులో ఒక మంచం, రెండు కుర్చీలు, ఒక టేబులు, కొన్ని పుస్తకాలు వుంటాయి. రమేష్ కుర్చీలో కూర్చొని చ దు వు కుం టూ వుంటాడు. జ్యోతి గది తుడవటానికి వస్తుంది]

రమేష్:-ఎవరమ్మాయ్ నీవు?

జ్యోతి:-పనిచేసె పిల్లనండి.

రమేష్:-నీ పేరేమిటి? మీదేవూరు?

జ్యోతి:-నాపేరు జ్యోతి అంటారండి. మాది ఈ వూరే.

రమేష్:-నీకు తల్లితండ్రులున్నారా?

జ్యోతి:-తల్లిలేదు, తండ్రి వున్నాడు.

రమేష్:-అయితే మీనాన్న ఏంచేస్తుంటాడు.

జ్యోతి:-మా అయ్య కూలిపని చేస్తాడు.

రమేష్:-మీఇంట్లో ఎవరెవరు వున్నారు?

జ్యోతి:-ఎవరు లేరండి.—నేను, మా అయ్య వుంటాము.

రమేష్:-మీ అమ్మపోయి ఎన్నిరోజులయింది?

జ్యోతి:-పది సంవత్సరాలయిందండి. మా అమ్మ నాకు తెలియదు.

రమేష్:-పాపం! మీ అయ్య నిన్ను బాగా చూస్తాడా?

జ్యోతి:-మా అయ్యకు మాత్రం ఎవరున్నారండి. ఇద్దరం ఒకరికొకరం సాయంగా వుంటాము. మాలో ఈ రోజువరకు బేధాలు లేవు.

రమేష్:-మరి మీ అమ్మ పోతే మీ అయ్య మళ్లీ పెళ్లి చేసుకోలేదా?

జ్యోతి:-లేదండి. అదంతా ఒక ... ...

[ఇంట్లోనుండి జ్యోతీ! జ్యోతీ! అని కేక]

జ్యోతి:-వస్తున్నానమ్మగారు.

రమేష్:-జ్యోతీ ఇల్లాచూడు. మా అమ్మ ఇంతసేపు అక్కడ ఏంచేస్తున్నావని అడిగితే ఏంచెప్తావు?

జ్యోతి:-ఏంచెప్తానండి. జరిగింది చెప్తాను.

రమేష్:-ఇవన్నీ చెప్పకు. పనిచెయ్యకుండా కబుర్లు చెప్తూ కూర్చున్నావా అని మా అమ్మ కోప్పడ్తుంది.

జ్యోతి:-అమ్మగారు కోప్పడ్తారని అబద్ధాలు చెప్పనా?
రమేష్:-అబద్ధమేముంది. పుస్తకాలు సర్దమంటే సర్దుతున్నానని చెప్పు.
జ్యోతి:-సరేలెండి. నేవెడ్తున్నా.

[జ్యోతి నిష్క్రమించును]

శ్యామల:-అదేమిటి జ్యోతీ ఒక్కగది తుడవటం ఇంత సేపయితే ఎల్లా?
జ్యోతి:- ... ... ... ...
శ్యామల:-పలకవేమిటి. ఇంతసేపు అక్కడ ఏంచేస్తున్నావు, పని అంతా ఒదిలిపెట్టి? మాట్లాడవేం?
జ్యోతి:-మీ అబ్బాయిగారు ఆగదంతాసర్ది తుడవమంటే తుడుస్తున్నానండి.
శ్యామల:-ఓహో! అబ్బాయిగారిగది సర్దుతున్నావా? ఇల్లా అయితే ఇహ నీవు పనిచేసినట్టే.
జ్యోతి:-చెప్పినపని చెయ్యకపోతే కోప్పడ్తారని చేశానమ్మా. ఇకణ్ణుంచి మీరు చెప్పినట్లే చేస్తాను.
శ్యామల:-రేపటినుంచి ముందు ఇంటిపనులన్నీ చెయ్యి తర్వాత అబ్బాయిగారిగది తుడువు. లేకపోతే ఏదో ఒక వంకపెట్టి నీకు అక్కడే సరిపోతుంది రోజంతా!
జ్యోతి:-సరేనమ్మా మీరు చెప్పినట్లే చేస్తాను.

* * *

## 3-వ రంగం

[రామన్న ఇల్లు. ఒక చిన్న మంచం, రెండు గిన్నెలు, పాతగుడ్డలు ఒక మూల, చిరుగులచాప ఒక మూల వుంటాయి. రామన్న మంచంమీద కూర్చొని జ్యోతి కొరకు ఎదురుచూస్తూ వుంటాడు. వీధిలో "అయ్యా, అయ్యా" అని జ్యోతి కేకవేస్తుంది]

రామన్న:-వస్తున్నానమ్మా. (అని తలుపు తీయును)
జ్యోతి:-ఏమిటి అయ్యా అల్లా వున్నావేం?
రామన్న:-నీ కోసం ఎదురుచూస్తున్నానమ్మా. ఇంత పొద్దుపోయిందే?
జ్యోతి:-ఏంలేదు.
రామన్న:-ఏంలేకపోతే అల్లా వున్నావేమమ్మా. పనిచెయ్యలేకపోతున్నావా?
జ్యోతి:-పని చాల ఎక్కువగా వుందయ్యా.
రామన్న:-అవును తల్లీ గొప్పోరి ఇంట్లో అంత చాకిరీ చెయ్యాలి. బదులు చెప్పకూడదు. గతిలేక నిన్నుకూడా దాసీదానిగ తయారుచేశాను. నావంటి నిర్భాగ్యపుతండ్రి వున్నా లేకున్నా ఒకటే.
జ్యోతి:-అదేమిటయ్యా అల్లా అంటావు. నీవు లేకపోతే నన్ను చూసేవాళ్లు ఎవరున్నారు. ఇద్దరం సంపాదించుకొని కాలం గడపాలికాని దర్జాగా నన్ను కూచోబెట్టి పెట్టడానికి మనమేమన్నా ధనవంతులమా?
రామన్న:-అవున్లే! అల్లా అనుకోకపోతే ఏంచేస్తావు. అమాయకపు దానివి. ఏమితెలియదు. ఎల్లా రోజులు గడుపుకుంటావో! ఒక అయ్య చేతిలో పెడ్తే నాభారం తగ్గుతుంది.
జ్యోతి:-నీకు నేను భారంగా వున్నానా (అని కన్నీళ్లు కార్చును)
రామన్న:-అది కాదమ్మా! నేను పెద్దవాణ్ణయ్యానా? నేను వున్నా లేకున్నా నీవు నీభర్త సుఖంగా వుండొచ్చు అని అన్నానుకాని నాకు బరువుగా వున్నావనికాదు. ఇప్పటికే చాల పొద్దు పోయింది. బువ్వతిని పడుకో తల్లీ.
జ్యోతి:-రేపు పొద్దున పెందలాడె పనిలోకి రమ్మన్నారు. చాల పని వుందిట.
రామన్న:-సరే! బువ్వతిని పడుకుందాం రా.

* * *

## 4–వ రంగం

[జమీందారుగారి ఇల్లు. ఉదయం ఎనిమిది గంటల సమయం. జమీందారు గారు, శ్యామల, రమేష్ కుర్చీలమీద కూర్చుని మాట్లాడుకుంటుంటారు]

శ్యామల:-ఈ పనివాళ్లు మరీ మితిమీరిపోతున్నారు.

ప్రకాశం:-ఏం! ఆ పిల్ల చెప్పినపని చెయ్యటంలేదా? చూట్టానికి నెమ్మదస్తురాలివలెవుందే.

శ్యామల:-పైకి అల్లాగే వుంటారు. నిన్న అబ్బాయి గది తుడవటానికనివెళ్లి ఒక గంటకు పిలవగా, పిలవగా వచ్చింది. ఈ రోజు పెందలాడె రమ్మంటే ఇంతవరకు రాలేదు. అప్పుడే ఎనిమిది గంటలయింది.

ప్రకాశం:-ఏరా రమేష్! నిన్న ఆ అమ్మాయి గది తుడిచేటప్పుడు నీవు అక్కడే వున్నావా?

రమేష్:-అక్కడేవున్నా నాన్న.

ప్రకాశం:-అంతసేపు అక్కడ ఏంచేసింది?

రమేష్:-గదంతా సర్దమంటే సర్దుతూంది.

ప్రకాశం:-పనివాళ్లని గదుల్లో అంతసేపు వుంచకూడదు. ఏదైనా సర్దాల్సివస్తే అమ్మతోచెప్పు. అంతేకాని నీవు దానితో ఎక్కువగా మాట్లాడకు.

రమేష్:-అల్లాగేలెండి.

[జ్యోతి ప్రవేశం]

శ్యామల:-ఏమే జ్యోతి పెందలాడి రమ్మన్నందుకా ఎనిమిది గంటలకువచ్చావు.- బాగుంది నీ పని. అడుగులోనే హంసపాదా?

జ్యోతి:-రాత్రి మా అయ్యకు జ్వరం వచ్చిందమ్మా. వొళ్లెరగడు. అందుకని అలశ్యమయింది. ఇప్పుడే కొంచెం కళ్లు తెరిచాడు.

శ్యామల:-మీకు రోజూ ఏదో ఒకటి వస్తూనే వుంటుంది. మేము చేసుకోలేకేగా నిన్ను పెట్టుకున్నది. నీ వాలకంచూస్తే పనిచేసేదానిలాగలేదు. కబుర్లుచెప్పుకోని కాలంగడిపేదానిలాగున్నావు కాని వళ్లువంచి పనిచేసేట్టులేవు. ఇప్పటికయినా త్వరగా పనిచెయ్యి.

జ్యోతి:-అల్లాగేనమ్మా — వెడ్తున్నా.

[జ్యోతి నిష్క్రమించును]

రమేష్:-(తనలో) పాపం! బీదవాళ్లకి స్వేచ్ఛలేదు గదా? తండ్రికి జ్వరమొచ్చి బాధపడుతుంటే అతన్ని ఒదిలిపెట్టి పనిలోకి రాలేదని అమ్మ సాధిస్తున్నది. ధనికులకు రోజులేకాని బీదలకు ప్రపంచంలో స్థానంలేదుగదా! (పైకి) అమ్మా! అనవసరంగా ఎందుకు ఆ అమ్మాయిని అన్ని మాటలన్నావు. జ్యోతి మంచిపిల్ల కాబట్టి వూరుకుంది. ఇంకొకరయితే దెబ్బలాడేవారు.

శ్యామల:-ఏమిట్రా నీకు మతిపోయిందా! నేనేం తప్పుమాట అన్నాను. మొండిచేతివానికి అటుకులు తినటం నేర్పినట్టున్నాయి నీ మాటలు. పనివాళ్లను వెనకేసుకొచ్చి నాతో దెబ్బలాడుతున్నావా?

రమేష్:-నేనేం దెబ్బలాడటంలేదమ్మా వున్నమాట చెప్పాను. పాపం! అమాయకపుపిల్ల. ఆ అమ్మాయినిచూస్తే జాలివేస్తుంది.

శ్యామల:-పాపం! ఎంత ధర్మమూర్తివి బయలుదేరావ్. జాలివేస్తుందని కొంపంతాదోచి దానికి పెట్టు.

రమేష్:-అవసరమొస్తే దోచిపెడ్తాను. డబ్బు కావల్సింది మనకుకాని వాళ్లకుకాదు. వారికి కావల్సింది ఆదరణగలమాటే. మనలాంటివారికి ధనపిచ్చికాని కష్టజీవులకుకాదు.

ప్రకాశం:-ఏమిటి రమేష్! నీ ధోరణి శృతిమించి రాగాన పడుతూంది. దోచిపెట్టడానికి నీ సంపాదన కానీకూడా లేదు. అనుకూలంగా వున్నన్ని రోజులే నీకు ఈ యింట్లో స్థానం. అది లేనిరోజు నీవుకూడా జ్యోతిలాంటివాడివే తెల్సిందా?

రమేష్:-తెల్సింది నాన్నగారూ. ఈ ఇంట్లో స్థానం లేకుండా పోవటమే నాకు కావల్సింది. దాంట్లోనే వుంది ఆనందం. ఈ ధనపిశాచానికి దాసులమై వున్నన్నిరోజులూ బీదల దుస్థితి మనకు తెలియదు.

[అక్కడినుంచి వెళ్లిపోతాడు]

[జ్యోతి ప్రవేశం]

జ్యోతి:-అమ్మగారు పనంతాచేశాను. నేను ఇంటికి వెడ్తున్నా.

శ్యామల:-సాయింత్రం పెందలాడి వస్తావా?

జ్యోతి:-మా అయ్యకు జ్వరం ఎల్లా వుంటుందో చూచి వస్తానమ్మా.

శ్యామల:-మీ అయ్యకు జ్వరం తగ్గనన్ని రోజులూ పనిలోకిరావా?

జ్యోతి:-ఎందుకు రానమ్మా. కొంచెం వెనకముందు వస్తానమ్మా. అసలు రాకుంటే గడవ్వొద్దుతల్లీ. బువ్వలోకి కొంచెం పచ్చడి పెట్టండి.

శ్యామల:-ఇప్పుడేంలేదు వెళ్లు.

[జ్యోతి నిష్క్రమించును]

* * *

5-వ రంగం

[రామన్న మంచంమీద పడుకొని యమబాధపడుతుంటాడు. మధ్య మధ్య "జ్యోతి-జ్యోతి - దాహం - దాహం" అంటూ వుంటాడు. జ్యోతి ప్రవేశం]

జ్యోతి:-ఏంటయ్యా జ్వరం ఎల్లావుంది.

రామన్న:- ... ... ... ... ...

జ్యోతి:-ఏంటయ్యా పలకవు. మంచి నీళ్లు కావాలా?

రామన్న:-(కావాలని సంజ్ఞచేస్తాడు)

జ్యోతి:-(మంచినీళ్లు ఇస్తుంది) చాలా అయ్యా.

రామన్న:-ఛా ... ల ... మ్మా. ఇల్లా ... వచ్చి ... కూర్చో.

జ్యోతి:-అల్లా మాట్లాడుతున్నావేంటయ్యా? ఆయాసంగావుందా? వైద్యుణ్ణి పిల్చుకోరానా?

రామన్న:-ఆయా ... సం ... ఎక్కు ... వగా ... వుంది ... కాని ... మ ... నకు ... వైద్యు ... డెల్లా ... వస్తా ... డమ్మా ... డబ్బు ... కావద్దూ.

జ్యోతి:-నాకు మూడునెల్లజీతం ఇవ్వాలిగా వాళ్లు. ఆ డబ్బు అడిగి తీసుకొని వైద్యుణ్ణి తీసుకోవస్తా. సరేనా!

రామన్న:- ... ... ... ... ...

జ్యోతి:-పలకవేం అయ్యా! అయ్యో భగవంతుడా మా అయ్యకూడ నాకు తోడులేకుండా చేస్తున్నావా? త్వరగా వెళ్లి డబ్బుతెచ్చి వైద్యుణ్ణి పిల్చుకోవస్తా. (అని వెళ్లిపోవును)

6-వ రంగం

[జమీందారుగారిఇల్లు. జమీందారుగారు అప్పుడే భోజనంచేసి కుర్చీలో కూర్చొని వుంటారు. ఆత్రంగా జ్యోతి పరుగెత్తుకుంటూ వస్తుంది.]

జ్యోతి:-బాబు దండాలండి. మా అయ్యకు జ్వరం, ఆయాసం ఎక్కువగా వుందండి. నా ... ...

ప్రకాశం:-వుంటే నన్నేం చెయ్యమన్నావు? నేనేమన్నా డాక్టర్నా మందు ఇవ్వటానికి –

జ్యోతి:-మిమ్మల్ని ఏంచెయ్యమనలేదండి. - నాకు ఇవ్వవల్సిన జీతం ఇప్పించండి. ఆ డబ్బుతో వైద్యుణ్ణి పిల్చుకోవెళ్తా.

ప్రకాశం:-నీకు ఎంత డబ్బు ఇవ్వాలి?

జ్యోతి:-నిన్నటితో మూడు నెలలయింది. మూడెని మిదులు ఇరవైనాలుగు రూపాయలు ఇవ్వాలి.

ప్రకాశం:-నీకు మూడు నెలలది ఇవ్వాలా? ఏ నెలకా నెల ఎందుకు తీసుకోలేదు?

జ్యోతి:-మీరే ఇస్తారుకదా అని అడగలేదు దొరా. ఇప్పుడు మా అయ్య ప్రాణంమీదికొచ్చింది గనుక అడుగుతున్నా. దయచేసి త్వరగా ఇప్పించండి బాబయ్య వెడ్తాను.

ప్రకాశం:-శ్యామలా! పనిచేసేదానికి ఇరవైనాలుగు రూపాయలు ఇవ్వాల్టకదూ! అడుగుతూంది.

శ్యామల:-అయ్యో, అయ్యో! ఫాతికరూపాయలే? ఈ నెల నొక్కటే ఇవ్వాలి, మొత్తానికి బలేపిల్ల. వాళ్లిబుద్ధి పోనిచ్చుకుందికాదు. ఏమేపిల్లా! నీకు ఏ నెలడబ్బు ఆ నెల ఇస్తుంటే ఇవ్వలేదని అబద్ధాలాడుతున్నావా? అందుకే నీ గతి అల్లా వుంది. దిక్కులేనిదానివైనావు. ఈ అన్యాయపు డబ్బుతో మందిప్పిస్తే నీ అయ్యకూడ చస్తాడు.

[రమేష్ ప్రవేశం]

రమేష్:-ఏమిటమ్మా ఈ గోల. జ్యోతి ఏడుస్తున్నదెందుకు?

శ్యామల:-చూడరా ఏ నెల జీతం ఆ నెలే తీసుకొని ఇప్పుడు మూడు నెలలది ఇవ్వాలంటుంది. ఎంత అన్యాయమో చూడరా?

రమేష్:-నేకనుక్కుంటూవుండు. ఏమే నీకెంత ఇవ్వాలి?

జ్యోతి:-నాకు తెలవదుబాబు. నేను మీ యింట్లో పనిచెయ్యటం మొదలుపెట్టినప్పటినుంచి ఒక్క కానికూడ నాకివ్వలేదు. ప్రతి నెలా జీతం ఇస్తున్నామన్నారు. ఇంక నేచెప్పింది ఎవరు వింటారు బాబు. రావల్సినడబ్బు అడిగినందుకు అమ్మగారు అనరానిమాట లంటున్నారు. కులానికి తక్కువైనా, గుణానికి తక్కువవాళ్లం కాదండి మేము. న్యాయంగా ఎంతరావాలో ఇవ్వండి. మా అయ్య ఒక్కడు వున్నాడు నే వెళ్ళాలి.

శ్యామల:-నీకు ఎంతరావాలోచూసి రేపు ఇస్తాను. ఇవ్వాళ ఒక్క కానీలేదు.

జ్యోతి: అదేమిటమ్మగారు. మా అయ్యకు మందు ఇప్పించాలి.

ప్రకాశం:-నీక్కాదూ చెప్పేది-తర్వాత ఇస్తాము ఫో.

జ్యోతి:-గొప్పవారిబుద్ధి ఇదేనా? చావు బ్రతుకుల్లో వున్న తండ్రికి మందు ఇప్పించాలంటే తొందర్లేదు పొమ్మంటున్నారు. ఇదేనా మీ సాను భూతి. (అని ఏడుస్తూ నిష్క్రమించును)

రమేష్:-అమ్మా! పనిదానికి మూడు నెల్లజీతం ఇవ్వాలని మొన్న చెప్పావుకదా? ఇప్పుడు లేదంటావేం?

శ్యామల:-ఆమర్నాడు ఇచ్చారా?

రమేష్:-ఎందుకమ్మా అబద్ధాలు. ఇందాక దానితో ఏ నెలకా నెల ఇచ్చానన్నావు. ఇప్పుడు మొన్న ఇచ్చానంటున్నావు. వాళ్లమీదవా మన అన్యాయ ప్రవర్తన. అందులో దిక్కులేని అబల కష్టపడి సంపాదించిన డబ్బా మనం అపహరించుట.

శ్యామల:-రమేష్! ఏమిటి నీ వాగుడు. దానిడబ్బు అపహరిస్తున్నానా! చాలు నీ మాటలు. ఎవరైనావింటే నిజమేననుకుంటారు. ఫో అవతలికి.

రమేష్:-ఎందుకమ్మా! అంతకోపం. నిజమంతేగా? అదేజబ్బు మనకువస్తే ఎంతమంది డాక్టర్లు, ఎంతమంది పనివాళ్లు కావాలో నీకేతెలుసు. ఇదంతా ఎందుకు? మనం ధనవంతులం కనుక. వారు

బీదవారు కనుక ఇవ్వవల్సిన డబ్బుకూడ ఇప్పుడు లేదు పో అన్నాము. మనకెంత స్వార్థంవుందో చూచావా? దీనినే ధనిక దౌర్జన్యమంటారు. పాపం! ఆ ముసలాడు ఎల్లావున్నాడో కదా? (అని రమేష్ నిష్క్రమించును)

శ్యామల:—చూసారా వాడి ఆగడం! వీడు కొంపంతా గుల్లచేసేట్టున్నాడు.

ప్రకాశం:—వాడిముఖం. వాడిదగ్గిర ఏముంది తగ లెయ్యటానికి. ఈ కాలంవాళ్లు ఇంతే?

*　　　*　　　*

## 7–వ రంగం

[రామన్న మంచంమీద పడుకొని మూల్గుతుంటాడు. జ్యోతి ఏడుస్తూ మంచం దగ్గిర కూర్చొని వుంటుంది.]

రామన్న:—ఏమమ్మా ... ప్రకా ... శం ... గారు ... డబ్బు ... ఇచ్చారా!

జ్యోతి:—(ఏడుస్తూ) ఇవ్వలేదు అయ్యా! వాళ్లు నాకు ఎనిమిది రూపాయలే ఇవ్వాలట.

రామన్న:—అదేమి ... టి ... మిగి ... లిన ... రెం ... డు ... నెల ... ల ... ది ఇవ్వ ... క్కర ... లేదా?

జ్యోతి:—ఎప్పటిజీతం అప్పుడే ఇచ్చారట. పైగా అన్యాయంగా పట్టుకెళ్లిన డబ్బుతో మందు ఇప్పిస్తే నీవు ... ... (గట్టిగా ఏడుస్తుంది)

రామన్న:—ఎందు ... కమ్మా ... ఏడుస్తావు ... ఏమన్నా ... రో ... సరిగా ... చెప్పమ్మా ... అబ్బా ... బాధ.

జ్యోతి:—నేను రెండు నెలల జీతం ఇయ్యలేదని అబద్ధ మాడుతున్నానట. అందుకనే దిక్కులేనిదాన్ని అయినానట. ఇంకా ఏమోమో అన్నారు అయ్యా. నీకు తగ్గేమార్గం కనపట్టంలేదు. నాగతి ఏంకానుందో?

రామన్న:—దిక్కు ... లేనివాళ్ల ... కు ... దేవుడే ... దిక్కు ... మ్మా ... నీవు ... ధైర్యంగా ... వుండు ... వెళ్ళి ... బువ్వ ... తిన ... మ్మా.

జ్యోతి:—నా కాకలి లేదయ్యా.

[వీధిలో జ్యోతీ! జ్యోతీ! అని కేక, రమేష్ ప్రవేశం]

రమేష్:—జ్యోతీ! ఇదుగో ఈ డబ్బు తీసుకో? ఇది పెట్టి మీ అయ్యకు మందు ఇప్పించు.

జ్యోతి:—మీ డబ్బు మాకొద్దు బాబు. మాకియ్య వల్సిందానికే అనరానిమాటలన్నారు. అన్యా యంగా ఒకరిసొమ్ము పుచ్చుకొనుట మాకు అల వాటులేదు.

రమేష్:—ఫరవాలేదు జ్యోతీ! మాఅమ్మ అన్నమాటలు విన్నాను. వారు కలియుగ రాక్షసులు. మీ వంటి అమాయిక ప్రజలదగ్గిర కాజేసిన డబ్బుతో లక్షాధికార్లయినారు. వారి అంత దుర్మార్గము నాకు చేతకాదు. అమాయిక ప్రజలను రక్షించి కాపాడుటయే నా కర్తవ్యము. అనుమానించక ఈ డబ్బు తీసుకో?

రామన్న:—ఎవ ... రమ్మా ... మాట్లాడే ... ది.

జ్యోతి:—జమీందారుగారి అబ్బాయి. డబ్బు ఇవ్వ టానికి వచ్చారు.

రామన్న:—ఎం ... దుకు.

రమేష్:—రామన్నా! నేను రమేష్‌ను. ఈ డబ్బు తీసుకొని జ్వరానికి మందు పుచ్చుకో.

రామన్న:—ఎంత ... బాబు.

రమేష్:—యాభై రూపాయలు.

రామన్న:—అంత ... ఎం ... దుక్కు ... మాకు ... రావల్సింది ... పాతి ... కే

రమేష్:—అదికాదు రామన్నా! మీకు ఇవ్వవల్సిన డబ్బు ఇదికాదు. నేను నీకు ధర్మంగా ఇస్తున్నా.

జ్యోతి:—మీ ధర్మాలు మాకు వద్దుబాబు. మమ్మల్ని ఇల్లా బ్రతకనివ్వండి. ఇవ్వాళ ఇస్తారు. రేపు మా ఇంట్లో దొంగతనం చేసిందంటారు. మీకు మీ డబ్బుకు నమస్కారాలు. వెళ్ళండి.

రమేష్:—జ్యోతీ! నీవు నన్ను అర్థంచేసుకోలేదు. నేను అల్లాంటి కిరాతకుణ్ణికాదు. తీసుకో! రామన్నా నీవయినాచెప్పు జ్యోతిని డబ్బు తీసుకోమని. నా సోదరివంటిది జ్యోతి. నా సోదరి దీనస్థితి చూడలేను.

రామన్న:—బాబూ ... రమే ... ష్ ... ఇల్లా ... రా ... నీ మే ... లు మర్చి ... పోలేను ... కాని ... నా త ... నువు ... శాశ్వ ... తం ... కాదు ... నా తరు ... వాత ... జ్యోతిని ... నీ ... సోదరి ... గా ... కాపా ... డ్తా నని ... వాగ్దానం ... చెయ్యి ... నాకదే ... చాలు. (అని రమేష్ చేత ప్రమాణం చేయించుకుంటాడు.) జ్యోతి ... ఇల్లారా ... నాప్రాణం ... పో ... తూంది ... ఈ రమేష్ ... అన్నయ్య ... దగ్గిర ... కా ... లం గ ... డుపు ... కో ... మనవంశ ... మర్యాద ... చె ... డ ... గొట్ట ... కు. (అని కళ్లు మూస్తాడు)

జ్యోతి:—అదేంటయ్యా! అల్లా పడిపోయావేం? అయ్యో పలకవేంటి? వళ్ళంతా ఇంత చల్లగా వుందే. (తండ్రిమీదపడి ఏడుస్తుంది.)

రమేష్:—జ్యోతీ! ఇంక మీ అయ్య నిన్ను విడిచి వెళ్లి పోయాడు. రా! మన ఇంటికి పోదాం?

జ్యోతి:—ఆ! మా అయ్య నన్ను వదిలి వెళ్లాడా? అయ్యో, భగవంతుడ నాకు మా అయ్యకూడ లేకుండచేసావా?

రమేష్:—పిచ్చిదాన! ఎంత ఏడుస్తే మాత్రం లాభం ఏమిటి. ఇంటికి పోదాంరా?

జ్యోతి:—మీ ఇంటికి నేను రాను బాబు.

రమేష్:—రాక ఎక్కడుంటావు?

జ్యోతి:—ఇక్కడే! మీ ఇంటికివస్తే మీ ధనపిశాచం నన్ను పట్టుకుంటుంది. ఆ బాధ నాకువద్దు. మీ ధనాశకు మా అయ్య ఆహుతైనాడు.

రమేష్:—చెల్లమ్మా! నామాటవిను. ఒక్కదానివి వుండలేవు.

జ్యోతి:—ఫరవాలేదు అన్నయ్యా! అయినా మీ అమ్మగారిని అడిగిరా వారికి ఇష్టమైతే వస్తా?

రమేష్:-సరే! నేవెడ్తున్నా. ఇప్పుడేవస్తా.

[రమేష్ నిష్క్రమించును]

* * *

## 8–వ రంగం

[జమీందారుగారిఇల్లు. జమీందారుగారు, శ్యామల కూర్చునివుంటారు. రమేష్ పిచ్చివాలకంగా వస్తాడు]

ప్రకాశం:—అదేమిటి రమేష్! అల్లా వున్నావేమిటి?

శ్యామల:—వాడికి పిచ్చెక్కింది.

ప్రకాశం:-ఎందుకు?

శ్యామల:—ఎందుకా? ఆ జ్యోతికోరకు.

రమేష్:—ఆ! ఏమన్నావ్. పిచ్చెక్కింది నాకుగాదు. నీకు. అమాయకపు అబలయైన ఒక కష్టజీవిడబ్బు అన్యాయంగా అపహరించి నీ ధనాశాపిశాచానికి దరిద్రజీవులను ఆహుతి చేసుకున్నందుకు నీకు పిచ్చెక్కింది. నీ దౌర్జన్యానికి దిక్కులేనిదై జ్యోతి అల్లాడిపోతున్నది. తోడునీడగావున్న తండ్రి నీ అన్యాయంవల్ల మందులేక గతించాడు.

ప్రకాశం:—ఏమిట్రా నీ ప్రతాపం. అంత దయగల వాడివి ఆశ్రయమివ్వలేకపోయావా?

రమేష్:—అది మీరు చెప్పక్కర్లేదు. ఆశ్రయమిచ్చే వచ్చాను. ఈరోజునుంచి జ్యోతి నాకు సోదరి. నాతోపాటు మీరు జ్యోతికికూడ ఆశ్రయమివ్వాలి.

శ్యామల:—రమేష్! నీకు మతిపోయిందా? పూటకు గతిలేని దాసియా నీకు సోదరి. చాలు నీ మాటలు. జ్యోతికి ఈ ఇంట్లో నిల్చుండుటకుకూడ అర్హత లేదు.

ప్రకాశం:—రమేష్! ఏమిటా ఉద్రేకం. బాగా ఆలోచించుకో? దాసిదాన్ని తెచ్చి ఇంట్లోవుంచుకుంటే లోకం ఏమంటుందో గ్రహించు.

రమేష్:—ఆలోచించాను. ఏమంటుంది? అనాధ బాలికకు ఆశ్రయమిచ్చారంటుంది. అంతకన్నా ఇంకేమంటుంది.

ప్రకాశం:—నీవు చిన్నవాడివి. నీకు తెలియదు. నా మాటవిను. మనవంశ మర్యాదలు మంటకలుపకు.

రమేష్:—వంశ మర్యాదలు మంటకలపటానికి నేనేం తప్పుపని చెయ్యలేదు. జ్యోతిని పోషించేభారం నాదని రామన్నకు ప్రమాణం చేశాను.

ప్రకాశం:—పిచ్చివాడా! చచ్చినవాడికి ఇవన్ని తెలుస్తాయా! బ్రతికిన నాల్గురోజులు గౌరవంగా బ్రతకాలి. ఈ జమీందారిహోదా అనుభవించదల్చుకుంటే నేచెప్పినట్టువిను. లేకుంటే నీ యిష్టం.

[రమేష్ ఆలోచనలోపడ్డాడు. ఆస్తికి నీళ్లు వదులుకొని జ్యోతిని పోషించడమా, లేక జ్యోతిని వదిలి తను ఆస్తి అనుభవించడమా అని ఆలోచిస్తున్నాడు. ఒకవైపునుంచి తండ్రి, ఒకవైపున రామన్న వాదించినట్టుంది రమేష్‌కు]

(రామన్న)

రమేష్! ఇదేనా నీ ప్రమాణం. మనిషి యెదుట మనిషి మాటలా? ఇదేనా నీ త్యాగం?

(ప్రకాశం)

ఓరేయ్! ప్రపంచం ఏమంటుందో ఆలోచించు. వంశమర్యాద మంటకలుపకు.

(రామన్న)

రమేష్! చేసినబాస మర్చిపోయావా? నీ సోదరి బాధలు చూస్తూ వూరుకుంటావా?

(ప్రకాశం)

రమేష్! బాగా ఆలోచించుకో? దాసీది నీకు సోదరా?

(రామన్న)

చిన్నబాబు! గుణం ప్రధానంగాని కులంగాదు. దాసీదనే హీనభావం నశించాలి. అదే లోకంలో అగ్రస్థానం అలంకరించేది.

(ప్రకాశం)

నీవు చేసినపని హర్షింపదగినదికాదు. నీ పట్టు విడువకుంటే జమీందారీ పదవికి నీళ్లు వదులుకొని పో.

(రామన్న)

నీ తల్లి తండ్రులు ధనాపేక్షవల్ల నాజీవితం ఆహుతి చేసుకున్నారు. నా జ్యోతినికూడ నీ ధనాశకు ఆహుతి చేస్తావా? ఇదేనా నీ సోదరప్రేమ?

(రమేష్ అంతరాత్మ)

ఛీ! నీ బ్రతుకింతేనా? పిరికిపందా! ధనాశకు లోనై అమాయకజీవికిచ్చిన ఆశ్రయం కాలదంతావా? ఇదేనా నీ త్యాగం. నీకొరకు ఎదురు తెన్నులు చూస్తున్న జ్యోతిక్షోభ ఆలోచించు... పో... త్వరగా... (ముందుకు నడుస్తాడు)

(అంతరాత్మ)

రమేష్! ఇదేనా నీ పితృభక్తి. కని పెంచి పెద్ద చేసిన తల్లితండ్రులను ఎదిరించి, ఒక దాసి పిల్ల కొరకు తల్లితండ్రులను వుసురుపెడ్తావా? ఇదేనా నీ పుత్రధర్మం? ఛీ ... నీ తండ్రి పుత్రశోకం తీర్చు ... ఛీ ... అదే నీకు మోక్షం ... ఊ ... త్వరగా ... (వెనక్కు నడుస్తాడు)

(అంతరాత్మ)

మూర్ఖుడా! పితృ దుఃఖం తీర్చుటకన్నా గొప్పదైంది అదే! తనువులు శాశ్వతంకావు. నీ తదనంతరమైనా లోకం నీ మాట మర్చిపోదు. "ధనానికి నీళ్లు వదులుకొని, దిక్కులేని అనాధ బాలికను సోదరికన్నా మిన్నగా కాపాడాడని" వేనోళ్ళ పొగడుతుంది. అదే నీకు ఇహపరములందు శాశ్వతమైన ఘనత. ఆలోచించు. నీకై వెదుక్కుంటూ వస్తున్నజ్యోతి దురవస్థచూచైనా త్వరపడు. ఆలోచిస్తూ కూర్చోటానికి టయం ఇదికాదు. అదుగో నీ సోదరి జ్యోతిచూడు నీ ఎదుట ఎట్లున్నదో? (ఎదురుగా జ్యోతి కనపడుతుంది)

జ్యోతి: అన్నయ్యా! ఇదేనా నీ సోదరప్రేమ. ఇంతసేపు ఎక్కడున్నావు? నీ కొరకు ఎదురు చూచి చూచి మతిపోయింది. ఆ రాతిమీద పడ్డానన్నయ్యా. తలపగిలింది. నా ప్రాణం పోయేట్టుంది. నా అవసానకాలమందు నా చివరమాట చెప్పటానికివచ్చా అన్నయ్యా! లోకంలో ధనికుల ఆగ్రహాలకు మావంటి నిరుపేదలు ఎంతమంది ఆహుతి అయినారో వారిలో మేము ఒకళ్ళం. నీవయినా బీదసాదలయందు దయగలిగి మాతాపితల ఋణం తీర్చుకో. ఛీ? నీవు ఇంతసేపటినుంచి ఏ ప్రాణికొరకై ఆలోచిస్తున్నావో ఆ జీవి ఈ లోకం విడిచి పోతున్నది. అన్నయ్యా! ఇదే నేను నీకు చెప్పే ఆఖరుమాట. నీ సోదరిమాట మర్చిపోకు. అబ్బా ... బా ... ధ ... (అని క్రిందపడి ప్రాణం వదుల్తుంది.)

రమేష్: ఆ! నా జ్యోతివి నీవేనా? ఎంతమోసం జరిగింది. ఎంతసేపటికీ తెగించలేక ఆలోచిస్తూ కూర్చున్న నన్ను విడిచి వెళ్ళిపోయావా? నా ఆలోచనకు నిన్ను ఆహుతి చేశానా? రామన్నా! నీకు చేసిన బాసతప్పి జ్యోతిని నీవద్దకు పంపిన ఈ రమేష్‌ను క్షమించవూ? హా! నేనెంతటి పాపాత్ముడనోకదా? సోదరీ ... ... ... (అని పడిపోతాడు)

(తెరపడును)






శ్రీమతి బారు సరోజినీదేవి

ఆ రోజు మహిళా సంఘం వార్షికోత్సవము, దానికి అధ్యక్షుడు డాక్టర్ శ్రీధర్. సంఘ స్థాపకురాలు సీతమ్మగారు లేచి ''సోదర సోదరీమణులారా! ఈ రోజు మన సభకు అధ్యక్షత వహించిన శ్రీధర్ రావు గార్కి నా ఆశీర్వచనములు. ఎందుకంటే నాకన్న వారు చాల చిన్నవారు నమస్కారం పెట్టడం అంత భావ్యంకాదు. ఆయన పిలవగానే రాననక, ఈ ఆడవాళ్ల సభలకు ఎవరు వెళతారు అని అయినా అనుకోకుండగా వచ్చినందులకు మనమందరముకూడ సంతోషించాలి. ఇప్పుడీ సభలో మెడికల్ విద్యార్థినులు, ఇంకా కొందరు పెద్దలు ఉపన్యసిస్తారు. తరువాత పిల్లల చేత డ్రామాలు, డ్యాన్సులు వున్నాయి. ఇవన్నికూడ మీరు శ్రద్ధగా చూచి, ఆనందించమని కోరుతున్నాను'' అంటూ సీతమ్మగారు ముగించి ఒక కాగితం మీద ఉపన్యాసకుల పేర్లు వ్రాసి అధ్యక్షుని చేతిలో పెట్టింది. శ్రీధర్ ఆ కాగితం తీసుకొని మొదట వున్న పేరుచూచి ప్రమీల అని చదివాడు.

18 సం॥ సుందరయువతిలేచి స్టేజిమీద శ్రీధర్ ప్రక్క నిలబడింది. ఆమె అధ్యక్షుని ప్రక్కనైనా, చూడలేదు. కాని ఆమెను చూచేసరికి శ్రీధర్ కండ్లు జిగేల్మన్నాయి. ఆమె మోము పున్నమ చంద్రునివలె ప్రకాశిస్తోంది. ఆమె కండ్లు నక్షత్రములవలె మిలమిల మెరుస్తున్నాయి. ఆమె ముంగురులు ఫ్యాన్ గాలికి తుమ్మెద రెక్కలవలె ఎగురుచున్నాయి. ఆమె పూర్తిగా ఖద్దరు ధరించియున్నది. ఆమె నుండి దృష్టి మరల్చుకోవడం శ్రీధర్‌కి చాలాకష్టమైయింది. ఎవరయినా చూస్తున్నారేమో అని అతను వెంటనే కండ్లు మరి యొక ప్రక్కకు త్రిప్పుకొన్నాడు. ప్రమీల ఉపన్యాస వేదిక ఎక్కి తనధోరణి మొదలు పెట్టింది.

''అధ్యక్ష సోదర, సోదరీ మణులార! నేనయిన గొప్ప ఉపన్యాసకురాలనుకాను. కాని నేటిమహిళా సంఘంలో ఉపన్యసించుటకు అవకాశం ఇచ్చిన సీతమ్మగార్కి నా వందనములు. నేనయినా అట్టే చదువుకొన్న దాన్నికాదు. నేడు నేనీసభలో మహా

త్మని ఆశయాలనుగురించి, ఆయన స్త్రీలోకానికి చేసినమేలునుగురించి చెప్పబోవుచున్నాను. నా వల్ల తప్పులున్న, ఒప్పులున్న, అధ్యక్ష, సోదర, సోదరీమణులందరు క్షమించవలెనని మొదటనే ప్రార్థిస్తున్నాను.

సోదర, సోదరీమణులారా! మహాత్ముడు మనదేశంలో హరిజనోద్ధరణకు అస్పృశ్యతా నివారణకు, జాతిమత విభేదాలను నశింపజేయుటకు, 40 కోట్ల భారతీయుల దాస్యశృంఖలాలవిముక్తికి తనజీవితమంతా ధారపోశాడు. ముఖ్యంగా నారీలోకానికి, మహిళాభ్యుదయానికి మహాత్ముడు చేసిన కృషి చాలా గొప్పది. అందుకు స్త్రీసమాజమంతా అయనకు నిత్యమూ చేయెత్తి మ్రొక్కవలసినదే. వంటయిల్లుతప్ప మరో రెండో ప్రపంచ మెరుగని భారతదేశపు స్త్రీలలో కొందరు నేడు విదేశరాయబారులుగాను, గవర్నరు పదవులలోను, మంత్రిణీ పదవులలోను, న్యాయాధికార పదవులలోను నియమింపబడుతున్నారంటే అది అంతా మహాత్ముని కృషిఫలితమే. మహాత్ముడు స్త్రీ విద్యను ప్రోత్సహించేడు. స్త్రీలకుగూడా పురుషులతో పాటు ఓటింగు హక్కు, అన్ని పదవులలోను నియమింపబడే అధికారము ఉన్నాయని నిరూపించాడు. గాంధీమహాత్ముని బోధలవలననే అనేకమంది స్త్రీలు విద్యనభ్యసించి, విజ్ఞానాన్ని గడించి, ధైర్యంతో, సాహసంతో నడుము కట్టి దేశసేవా రంగములోనికి దుమికారు. కాంగ్రెసులో కత్తిగట్టి, పని చేసారు. స్వాతంత్ర్యం కోసమై బ్రిటిష్ వారితో పోరాడేరు. సత్యాగ్రహాలు చేశారు. నిరశనవ్రతాలు జరిపేరు. ఆఖరుకు దేశస్వాతంత్ర్యం కొఱకై తమ ప్రాణాలను అర్పించడానికైకూడ వెనుదీయలేదు. నేడు భారతదేశంలోని కొద్దిగ్రామాలలోని స్త్రీలు తప్ప ఇంచుమించుగా అందరు స్త్రీలుకూడా ఎంతటి కఠినకార్యమైనా ఆచరించడానికి సిద్ధంగా ఉన్నారు అంటే అది అంతా గాంధీ మహాత్ముని కృషిఫలితమే అని చెప్పాలి. బాపూజీ దేశంకోసమై పోరాడి, పోరాడి, నిరశనవ్రతాలు జరిపి చివరకు స్వాతంత్ర్యకవాటం చేరగలిగాడు. భారతీయులందరకూ ఆయన స్వాతంత్ర్య ద్వారం తెరచి చూపించాడు. సత్యము, శాంతము, అహింస మొదలగు ధర్మములెన్నో మహాత్ముడు మనకు బోధించాడు. వాటిని మనం ఆచరించాలి. ఇతరులకు బోధించి ఆచరింపజేయాలి. మత విద్వేషాలు, కొట్లాటలు నశింపజేయాలి. అస్పృశ్యతను నివారించాలి. సర్వమానవ సౌభ్రాతృత్వముగల్గియుండాలి. దానికి దేశంలోని ప్రతి సోదరీమణి, పిల్లలు, పెద్దలు అందరూ నడుము కట్టుకొని దీక్షబూని పనిచేయాలి. అప్పుడే దేశంలో శాంతి నెలకొల్ప బడగలదు.

అప్పుడే స్వర్గధామంలోని మన బాపూజీ ఆత్మకు శాంతి;

కనుక స్వతంత్ర భారత దేశములోని ప్రతిపౌరుడూ, ముఖ్యముగా ప్రతిసోదరీ మణీ ఇప్పటికైనా దేశశాంతికై పాటుపడ తారనే నమ్మికతో, ఆశతో నాయీస్వల్ప ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను. భారత మహిళలందరూ ఉత్సాహవంతులై, చైత న్యవంతులై, భారత దేశశాంతికై పాటు పడి పూజ్య బాపూజీ ఆత్మకు శాంతినిచే కూర్చుదురుగాక" అని ప్రమీలందరికీ నమస్కరించి క్రిందకు దిగి వెళ్లిపోయింది. ఆమె ఉపన్యాసం విని ప్రజలు ఆశ్చర్య చకితులయ్యారు. ముఖ్యంగా శ్రీధర్‌కి ఆశ్చర్యమునకు అంతులేకుండగా పోయింది. తరువాత ఉపన్యాసాలు, పిల్లలనాటకాలు, డ్యాన్సులు, అన్ని ముగిసాయి. అధ్యక్షుడు లేచి "సోదర, సోదరీమణులార! మన భారతమాత యిటువంటి, వీరపుత్రికలను పుత్రులను కన్నందులకు ఎంతో ధన్యాత్ము రాలు. స్త్రీవలనే పురుషునకు గౌరవ మయినా, అగౌరవమైనా కలిగేది. స్త్రీ దేవతా స్వరూపిణి, శక్తిస్వరూపిణీ, ఆమె తలచుకొంటే ఎటువంటిపని అయినా చేసి తీరుతుంది. మన భారతదేశంలో ఝూన్సీ, బాలాంబ, రుద్రమ, మొదలగు వీర నారీ మణులు ఎంతగొప్ప పన్లుచేసారు! స్త్రీలు చదవగానే సరికాదు. చదివినచదువు ఆదర్శ ముగా చూపెట్టాలి. పల్లెలనుకూడ పట్నాలక్రింద తయారు చేయాలి. ఇప్పుడు ప్రమీల చెప్పిన విషయాలు అందరు విన్నారు. బాపూజీ స్త్రీలోకానికి ఆదర్శ మూర్తి," అని చెప్పి శ్రీధర్ కూర్చు న్నాడు. సీతమ్మగారు లేచి "మొదట మాట్లాడిన అమ్మాయి ప్రమీల M. B. B. S స్టూడెంటు. మామహిళా సంఘం వృద్ధిలో నికి వచ్చుటకు కారణము ఆ అమ్మాయి ప్రోత్సాహమువలనే. తరువాత శ్రీధర్ గారు అధ్యక్షత వహించినందులకు, సోదర, సోదరీమణులు యింతవరకు కూర్చున్నందు లకు నా మనఃపూర్వక నమస్కారములు" అంటూ సభముగిసింది.

శ్రీధర్ యింటికివచ్చాడు. వచ్చేసరికి బంట్రోతు ఓ కవరు అందించాడు. గబ, గబ, ఆతురతతో విప్పాడు అది తండ్రి వ్రాసినది. చి॥ శ్రీధర్‌కి మీతండ్రి దీవించి వ్రాయునది. నీవు ఎన్ని వుత్తరములు వ్రాసిన జవాబు వ్రాయవు. మీ మేన మామ తనకూతురు పెండ్లి విషయమై చాల తొందర పడుతున్నాడు. వాళ్లు ఎన్నాళ్లని ఆడపిల్లను వుంచుతారు! యింక నీవు ఆలస్యముచేయక పెండ్లికి త్వరపడుము. యింక నీ సమ్మతి లేకుండగానే వాళ్లకు మాటయిస్తున్నాను. ఇదివరకు అడుగుతే ఉద్యోగము అవుతేగాని చేసుకోనన్నావు. ఇప్పుడు నెలకు 800రూ॥లు సంపాదించు

కొంటూయున్నావు. మీ అమ్మ పోనే పోయినది. నేనయినా పెద్దవాడనయాను. మీ భార్యా భర్తలు, యిద్దరు ఒక్క చోటవుంటే చూచి ఆనందిస్తాను. ఇంక నాకు మిగిలిన కోరిక యింతే. జవాబు వ్రాయి.

ఇట్లు
కె. రమణారావు

ఆ వుత్తరం చూచేసరికి శ్రీధర్ కి అరికాలిమంట నెత్తికెక్కింది. ఛీ ఏమయినా సరే నేను ఆ అమ్మాయిని చేసుకోను. ఇంత చదువు చదువుకొని ఆఖర్కి చదువు సంధ్యలు లేని యువతిని ఎలా పెండ్లి చేసుకోను. నా యిష్టం లేకుండగానే నిర్ణయిస్తున్నారా? పెండ్లి చేసుకొని కాపురం చేసేది నేనా? వాళ్లా? ఎంతమాత్రము అలా జరుగుటకు వీలులేదు ఇప్పుడే ఉత్తరం వ్రాసి పడేస్తాను అనుకొని వెంటనే తండ్రికి ఉత్తరం వ్రాసి పోష్టులో పడేసివచ్చాడు. ఆ రాత్రి అతనికి కంటిమీద కునుకులేదు. కళ్ళుమూస్తే ప్రమీల ప్రత్యక్షం, అబ్బ ఏమిఅందం, ఏమివాగ్ధాటి! ఏమిచదువలేదన్నది — నిజమే అనుకొన్నాను. కాని M. B. B. S. చదువుతూనే ఏమి చదువుట లేదని చెప్పింది. ఇంతకు ఆమె, నేను, ఒక ఆస్పత్రిలోనే—రేపు ఆమెను తప్పక కలుసుకోవాలి. ఛీ మేనమామకూతురిని ఎలాగ చేసుకోవడం? నేను చేసుకోలేను. అంటూ కండ్లు మూసుకొన్నాడు. ఆ రాత్రి అతా సుఖస్వప్నాలు కంటూ పడుకొన్నాడు.

ఆమర్నాడు డ్రస్ వేసుకొని ఆస్పత్రికి వెళ్లేడు. ఆ రోజు అతనికండ్లు లేడీస్టూడెంట్సు మీదేవున్నాయి. అతని కళ్లకు చాలమంది కనపడ్డారు కాని ప్రమీల మాత్రము కనపడలేదు. ప్రైవేటు రూములో ఆలోచిస్తూకూర్చున్నాడు. ఇంతలో నర్సు వచ్చి "డాక్టర్ రోగులను పరీక్ష చేసేటైము అయింది వస్తారా" అని అడిగింది. "ఓ పద అంటూ" రోగులను చూచుటకు బయలు దేరాడు. ఆ రోజు M. B. B. S. స్టూడెంట్సు V year వాళ్లకు రోగుల యొక్క ఏ ఏ జబ్బులు, ఏ ఏ విధంగా వస్తాయో ఆ స్టూడెంట్సుకి చెప్పాలి. అంతవరకు నవ్వుల లోనున్న పిల్లలు డాక్టర్ నిచూచి మౌనం వహించి నమస్కారం పెట్టారు. కాని శ్రీధర్ అవేవి గమనించలేదు. తన పనిలో తను నిమగ్నుడయాడు. ఒక్కొక్క స్టూడెంటుకి ఆ రోగుల యొక్క లక్షణాల గూర్చి చెప్పుకొంటూపోతున్నాడు తలైనా పైకి ఎత్తలేదు. ఆ జట్టులో ప్రమీలకూడ వుంది. తనవంతు వచ్చింది. శ్రీధర్ తలవంచుకొనే చెపుతున్నాడు. ఆ రోగికాలు, చేయి, ఒణికిపోతున్నాయి. శ్రీధర్ ఆ సంగతి చెప్పకుండానే ఏదో చెప్పుకొనిపోతున్నాడు. కాని ప్రమీలకు ఏమి అర్థం అగుటలేదు. ఆమె యింకలాభంలేదను

కొని ఏమయినా సరే డాక్టరుని ఆ సంగతి ఏమిటో అడిగేద్దామని అనుకొంది. "ఏమండి డాక్టరుగారు ఆ రోగి కాలు, చేయి, అలా ఒణుకుతున్నాయి కారణం ఏమిటి" అని తపెమని అడిగింది. ఆ గొంతుక ఆనవాలు పట్టి శ్రీధర్ తలపైకెత్తి చూచేడు. ప్రమీలనుచూచి తనను తాను మర్చి పోయాడు. ఆమె అడిగింది ఏమిటో తాను చెప్పవలసిన దేమిటో కూడ గుర్తుకి రావడము లేదు. ఇంతలో నర్సు దగ్గరకు వచ్చి "డాక్టర్ అవతలగదిలో ఒక రోగి చాల బాధపడుతున్నాడు త్వరగారండి" అని కంగారుగా చెప్పింది. ఆమాటకు శ్రీధర్ ప్రమీల వైపు తిరిగి "నా బంగ్లాకురండి ఆ రోగవిషయమేమిటో చెపుతాను" అని వెళ్లి పోయాడు. ఆ మాటకు ప్రమీలమండి పడింది. ఈరోగ విషయం తెలుసుకోవడాన్కి తనబంగ్లాకి రావాలిట - అనుకొని తిరిగి కడంరోగులను వాళ్లే చూచుకొంటూ బయలుదేరారు. యింతలో టైము అగుట చేత ఎవరిమట్టుకు వాళ్లు యిండ్లకు బయలుదేరారు. ప్రమీల, కమల, లక్ష్మి, ముగ్గురుకలసి హాస్టలు వైపు బయలు దేరారు. త్రోవలో ముగ్గురు సంభాషణలో దిగారు. "ఏమే ప్రమీల! ఈ క్రొత్తగా వచ్చిన డాక్టరు, చాల అందమైనవాడు, చురుకైనవాడూనే - ఏమంటావు?" "సరే ఆయన చురుకు, అందం, మనకెందుకే లక్ష్మి" అయినా నాకు ఎప్పుడూ ఎవరు అందమైనవారా, ఎవరు చురుకైనవారా, అన్న ధ్యాసే! పోనీనామాట అబద్ధం అవుతే కమలని అడుగు. ఏమే కమలా! నీవు చెప్పు ఆ డాక్టరుగారి సంగతి" "అవునే లక్ష్మి నీవన్నమాట నిజమే. ఆయన భార్య ఎవరోకాని చాల అదృష్టవంతురాలు. అటువంటి అందమైన భర్తను పొందినందులకు ఎంత గర్వించాలో" "సరే బాగానే వున్నాయి మీమాటలు, ఎవరయినా వింటే నవ్వుతారు ఊరుకోండి. అందుకే అంటారు పెద్దలు ఈ చదువుకునే ఆడవాళ్లు తిన్నగా ఉంటారా అని" "ఏం తప్పా చెప్పు కొంటే ప్రమీలా! పోనీ నీవేచెప్పు ఆయన మాటలో ఎంత చమత్కారముందో! ఎంత ఠీవివుందో? మేమిద్దరం వాగేవాళ్లం కనుక పైకి అన్నాము, నీవు మనస్సులో అనుకొంటావు;అంతే నీకూ, మాకు తేడా!" "కమల, లక్ష్మి మీరిద్దరుకూడ పొరపడుతున్నారు ఆయన్నిగురించి మనస్సులో కూడ అనుకోను. ఇంక రేపటినుంచి ఆయన క్లాసుకికూడ రాను తెలుసునా" 'ఏమే ఎందుకురావు, ఆయన అంటే నీకుకోపమా' 'అవునేకోపమే ఇవాళ ఆయన ఏమన్నారో నీకు తెలుసా' 'ఏమన్నారే' "ఆరోగికాలు, చేతినిగురించి అడుగుతే తన బంగ్లాకివస్తే అరోగ విషయాలు చెప్పతాడట-అందుకు నన్ను రమ్మన్నాడు. ఈ మాటలేకాని

స్టూడెంట్సు వింటే నన్ను ఎంత హేళన చేసేసేవారు" "నిజంగా అలాఅన్నాడా ప్రమీలా" "నిజమేనే అబద్ధం ఆడతానా" అంటూ ముగ్గురు హాస్యాలు చేశేరు.

శ్రీధర్ మామూలుగా ఆస్పత్రికి వచ్చాడు. ఆ రోజు మెడికల్ స్టూడెంట్సు అందరు అగుపడ్డారు కాని ప్రమీల అగుపడలేదు. 10 రో॥ నుండి ప్రమీల తనకు అగుపడ్డంలేదు. అతనికి చాలా ఆశ్చర్యం వేసింది. అసలు తను కాలేజీకి వస్తూందా? లేదా ? వచ్చికూడ తనక్లాసుకి రావడం మానివేసిందా ? ఈ అనుమానంతో అతను తికమకలు పడిపోతున్నాడు.ఆ రోజు లక్ష్మికి రోగాన్నిగురించి పాఠం చెపుతున్నాడు పాఠంపూర్తి అయినతరువాత "ఏం లక్ష్మి మీస్నేహితురాలు ప్రమీల కాలేజికి రావడం మానేసిందా" అని మెల్లిగా అడిగాడు. ఆమాటకు లక్ష్మి ఆశ్చర్యపోయింది. ప్రమీల అంటే ఎందు కితని కింత ప్రేమ! "ఏంలక్ష్మి ఏంటి ఆలోచిస్తున్నావు. "ఆమాటకు ఆమె ఆలోచనమాని "అబ్బే ఏమీలేదు ప్రమీల కాలేజీకి వస్తోంది మానలేదే" "ఏంటి కాలేజికి వస్తూందా! అయితే 10 రోజులనుండి నా క్లాసుకు రావడంలేదే" "ఏమో నాకు తెలియదు" అని ఎవరి మట్టుకు వాళ్ల పాఠాలు అవగానే వెల్లి పోయారు. శ్రీధర్ యింటికి వచ్చాడు కాని అతని మనస్సు అనేకవిధాల బాధపడుతోంది. తనయందు ప్రమీల ఏమయినా దురభిప్రాయం పడేవుంటుంది; లేకపోతే ఆడదాన్ని బంగ్లాకి రమ్మంటే ఏమనుకొంటుంది? అందులో ఈరోజు లక్ష్మినికూడ అడిగాడు - ఛీఎంత అవివేకపు పనిచేసాడు. ప్రమీల-అబ్బ-అని ఆమెను తలచుకొంటూ ఆలోచనలో పడ్డాడు. ఇంతలో పోష్టుమేన్ పిలుపు విని బయటకు వెళ్లాడు. ఉత్తరం పుచ్చుకొని లోపలికివచ్చి విప్పిచదివాడు. అదిచూచి తనను తాను నమ్మలేకపోయాడు. పెండ్లి నిశ్చయించినట్లు, ఈ నెలాఖరున మూహూర్తం నిశ్చయించుచున్నట్లుకూడ వ్రాసారు. అది చూచేసరికి పట్టరానంత అవేశంకలిగింది. ఇంకా నా పెండ్లి ఆపల్లెటూరి మృగంతో అవవలసిందేనా? ఆఖరికి చాకలిపద్దుకూడ వేయుడం చేతకాదే? అప్పుడే ముహూర్తం కూడ నిశ్చయించారుట. ఎంతధైర్యం! తండ్రి అవుతేమాత్రము పెండ్లికి బిడ్డల ఇష్టంలేదా ? ఇప్పుడెలాగ? ఏమయినా నేను రానని ఉత్తరం వ్రాసేస్తాను అని లేచి కాగితం, కలంతీసుకొని కుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో బంట్రోతు "అయ్యా మీకోసం ఎవరో అమ్మాయి వచ్చింది" అన్నాడు. అమ్మాయి అన్నశబ్దం వినేసరికి శ్రీధర్ కి ఆదుర్దా ఎక్కువై పోయింది వెంటనే ప్రవేశ పెట్టు అన్నాడు. బంట్రోతు బయటకు వెళ్లిపోయాడు. ప్రమీల ఉగ్ర

నరిశింహ అవతార రూపంలో ప్రత్యక్షం అయింది. ఆమె కోపంపట్టలేక "ఏమండీ! మీరు మర్యాదగల వంశంలో పుట్టిన వారేనా" అని అడిగింది. ప్రమీలయొక్క మొహాన్ని, మాట వినిచూచి శ్రీధర్ కొయ్యబారిపోయాడు. కొంచెము సేపటికి తేరుకొని "ఏమండీ నేనుమర్యాదగల వంశంలో పుట్టినవాడినే – యిప్పుడు నాకే మెచ్చింది. అయినా మీరు మర్యాదస్తులు అవుతే నేను మర్యాదస్తుడనే"చాలు"మీ మాటలు–మీరు ఎంత అధికారులైనా ఒక స్త్రీ విషయంలో–అందులో అవివాహితను గురించి మీరు ఇతరులతో ప్రసంగించవచ్చునా? అదే మీ భార్యనుగురించి ఎవరయినా ఇలా ప్రసంగిస్తే మీ మనస్సు అప్పుడెలాగుంటుంది? మీరు ఏమయినా మాట్లాడేటప్పుడు ఆలోచించి మాట్లాడారా" ఆమె మాటలకు అతను చకితుడయ్యాడు. "ప్రమీలా క్షమించు. నీకింత కోపంవస్తుందని అనుకోలేదు. నాకు యింకా పెండ్లి అవలేదు. నీలాంటి విద్యావతిని, గుణవతిని భార్యగా పొందాలని నా కోరిక కాని భగవంతుడు దానికి వ్యతిరేకిస్తున్నాడు" ఆ మాటలు అంటూవుంటే శ్రీధర్ కి రెండుకండ్లు నీటితో నిండి పోయాయి. ఇంక మాట్లాడలేకపోయాడు. అతని ముఖము చూచేసరికి ప్రమీల హృదయం నీరయిపోయింది. తను అతని హృదయాన్ని ఇంత బాధ కలిగించినందులకు తనను తాను తిట్టుకొంది. "డాక్టర్ క్షమించండి, నేను తొందరపడి ఏవేవో మాటలన్నాను. అయితే మీరింకా పెండ్లి చేసుకోలేదా?" "ప్రమీలా! నాకొక పల్లె పశువుని నిశ్చయించినారు. ప్రమీల ఏమని చెప్పను! చదువు సంధ్యలురాని అడవి మృగం – ఆ అమ్మాయితో ఎలా కాపరం చేయమన్నావు? అటువంటి స్త్రీలు మీ మహిళా లోకానికి ఏమిపనికొస్తారు? కాని యిప్పుడనుకొన్నందువల్ల ఏమి లాభం? పెండ్లి నిశ్చయించినారు. ఇదిగో నేనిప్పుడే ఆ అమ్మాయిని చేసుకోనని నా తండ్రికి ఉత్తరం వ్రాస్తున్నాను" "డాక్టరుగారూ మీరు పెద్దల మనస్సు కష్టపెట్టడం అంత భావ్యంకాదు. తమరు చదువుకొన్నవారు. ఆ అమ్మాయి తమ దగ్గరకు వచ్చిన తరువాతే విద్య నేర్పండి. మీరు తండ్రికి వ్యతిరేకంగా ఉత్తరంవ్రాస్తే ఆ ముసలి ప్రాణం ఎంత కొట్టుకొంటుందో మీరేమయినా ఆలోచించారా? అలా ఎప్పుడు ఎవరి మనస్సు కష్టపెట్టకండి. తరువాత మీ నేర్పుతో మీ భార్యను విద్యావంతురాలుగాచేయండి" "ప్రమీల నీవు నాకు జ్ఞానోదయం కలిగించావు. నీవంటి చదువుకొన్న స్త్రీలకు యిటువంటి భావాలు కలగడం చాల అరుదు. కాని ప్రమీలా నీవు ఆ అమ్మాయిని చేసుకోమని ప్రోత్సహిస్తు

న్నావు. నా తండ్రిచూస్తే ముహూర్తం నిశ్చయించేడు. నీవు మాత్రము నా పెండ్లికి తప్పక రావాలి సుమా'' 'డాక్టర్ మీ పెండ్లి ఏ తేదీన' ''ఈ నెల 28 తే॥ నిశ్చయించారు'' ''అయ్యో ఆ తేదీకి అవుతే నాకు తీరుబడివుండదే'' ఏం ప్రమీలా నీవు ఊరికి వెళతావా'' ''అవును మా నాన్నగారు అర్జంటుగా రమ్మనమని ఉత్తరం వ్రాశారు. కారణం ఏమిటో నాకేమి అర్థమగుటలేదు. వీలు అవుతే మాత్రము తప్పక వస్తాను'' అంటూ ప్రమీల వెళ్లుటకు లేచింది, కాని ఆమెకు ఏదో అనుమానంకలిగి ''డాక్టర్ మీ ఎడ్రసు-మీకు ఏ వూళ్లో పెండ్లి?'' ''నాకు పెండ్లి ఎక్కడవుతుందో తెలియదు. కాని మాది రాజమండ్రి, మా యిల్లు దానవాయి పేటలో వుంది. ఎవరు అడిగినా చెపుతారు'' ''ఓ అలాగా అంటూ'' ప్రమీల రాజమండ్రి, దానవాయిపేట అన్న ముక్కలు తలుచుకొంటూ మెల్లిగా హాస్టలు చేరింది.

''ఏంనాన్నగారూ మామకూతురుని చేసుకోనంటూవుంటే మీరందరు ఇంత పట్టుపట్టడం నాకేమి బాగుండలేదు'' ''అలా అనకు నాయనా మీ అమ్మ పోయేటప్పుడు తన అన్నగారి కూతురినితప్ప యింక ఎవరిని చేయవద్దని నాచేత వాగ్దానం చేయించుకొంది. ఇంకొక పిల్లను నీవు చేసుకొంటే నీ తల్లి ఆత్మకు శాంతివుంటుందా? మామకూతురుని చేసుకొంటే ఆమె ఎక్కడున్నా సంతోషిస్తుంది. ఏం నాయనా అది మాత్రము అందహీనురాలా? ఇప్పుడది అయినా డాక్టరు ...'' ...'చాలు ఊరుకోండి-యింక ఆ అమ్మాయిని గురించి నాకేమి చెప్పనవసరము లేదు' అంటూ శ్రీధర్ గదిలోకి వెళ్లిపోయాడు. కాని అతని కళ్లకు ప్రమీలే అగుపడుతోంది. అబ్బ ఎంత వినయము! ఎంత అణకువ! ఆమెను పెండ్లిచేసుకొనే యువకుడు చాల ధన్యుడు.

పెండ్లి మహావైభవంగా జరిగింది. కాని అతను పెండ్లికూతురి ముఖమైన ఎలాగుంటుందో చూడలేదు. పౌరోహితులు కూర్చోమంటే కూర్చోడం, లేవమంటే లేవడం, తన శరీరం తన వశంలో లేకుండగా పోతోంది. శరీరం తిరుగుతున్నట్లు అవుతోంది. తన కళ్లకు ప్రమీల స్నేహితులు కమల, లక్ష్మి అగుపడ్డారు ప్రమీల కూడ వచ్చిందా అని అడుగుదామని అనుకొన్నాడు, కాని ఆ రోజు కాలేజీలో అలా అడిగినందుకే ప్రమీలకు కోపంవచ్చిందని, అలా అడగకూడదని ఊరుకొన్నాడు. ఆమె వచ్చిందేమో అని కళ్లు నాలుగుమూలల వెతకసాగాయి, ప్రతి స్త్రీని పరీక్షగా చూచాడు. స్త్రీలనుచూస్తే ఏమయినా అనుకొంటారేమో అని వెంటనే తల దించేసుకొన్నాడు. మూడుముళ్లు ఆమె మెడలోని మంగళ సూత్రానికి వేశాడు.

ఇప్పుడతడు ఒక స్త్రీకి భర్త అయ్యాడు. ఇంక యిప్పటినుండి పరస్త్రీని సోదరిగా భావించాలి. ఆ రాత్రి గది చాల తమాషా అయిన లతలతోటి, తీగలతోటి అలంకరింపబడింది. అతను గదిలో ప్రవేశించాడు. పెద్దల ఆచారప్రకారము చేయుటకు ఒప్పుకొనలేదు. అందుచేత ఎవరిమట్టుకు వాళ్లు ఆ విషయంలో జోక్యం కలిగించుకొనలేదు. ఒక కుర్చీలో కూలపడ్డాడు. ఆ గది శృంగారము అతన్ని ఏమీ సంతోషము కలిగించుటలేదు. ఇంక తనభావి జీవితాన్ని గురించి ఆలోచన మొదలపెట్టాడు. ఈ అమ్మాయితోటి ఎలా ప్రవర్తించాలి, ఏమని పిలవాలి, రేపు పట్నం తీసుకొనివెళ్లి ప్రమీలకు, ఇరకా తన స్నేహితులకు ఏమని పరిచయంచేయాలి? అయ్యో ప్రమీలవచ్చి ఇంగ్లీషులో What is your Name అంటే ఈమె తెల్లమొఖం పెట్టాలే? "అబ్బ నా జీవితం ఎంత దుర్భరమైపోయింది. ఎవరికయినా ఈ రాత్రి ఎంతో ఆనందంగాను, స్వర్గంలోవున్నట్లు భార్యాభర్తలు ఇద్దరు ఆ సంతోషంలో తేలిపోతారే! కాని నాకటువంటి సంతోషం ఈరాత్రిఏది? ఈ రాత్రి నాకు కాళరాత్రి. ఈ రాత్రి నాకు యమలోకం - అబ్బ !తలుచుకొంటే గుండె గుభేలు మంటూంది'' ఇలా తలుచుకొనేసరికి కళ్లు నీళ్లతో నిండాయి, ఒళ్లు తిరిగిపోతోంది, మెల్లిగాలేచి మంచంమీద పడుకొన్నాడు. రాత్రి 11 గం॥ అయినది.

మెల్లిగా తలుపుతీసుకొని ఎవరో వచ్చినట్లు అయింది. శ్రీధర్ మెలుకువగానేవున్నాడు, కాని తలఎత్తి ఎవరు వచ్చినారా అని అయినా చూడలేదు. పాపం ఆ యువతి ఎంతోసంతోషంతో లోపలప్రవేశించింది. భర్త వాలకంచూచి హడిలిపోయింది. ఆమె క్రొత్త పెండ్లికూతురు! మొదట స్త్రీ ఏమని భర్తని పలకరిస్తుంది? ఆమె అలా ఒక 10 ని॥ నిలబడింది. ఇంక ఆమె ఆశ నిరాశయి అక్కడ ఒక కుర్చీలో కూలపడింది. శ్రీధర్ ఆమెవైపే చూడలేదు. కాని మనస్సు బాధపడింది. పాపం అమాయికురాలు ఆమె ఏమిచేస్తుంది! ఆమె విద్యావిహీనురాలైతే ఆమెను మొదటే వివాహము చేసుకొనరాదు. పెండ్లిచేసుకొన్న తరువాత ఆమెను బాధపెట్టడం యువకుని ధర్మంకాదు. అబల, స్త్రీ ఏమిచేయగలదు? మొగాడు అవుతే ఎంతమంది స్త్రీలతోనయినా పోవచ్చుకాని హిందూ స్త్రీకి చేసుకొన్న భర్తే ఆమెకు దైవం, అని నమ్ముతుంది. భర్త ఎన్ని కష్టాలుపెట్టినా అనుభవిస్తుంది. ఆఖర్కి ప్రాణం అయినా నవ్వుతూ అర్పిస్తుంది. ఛీ తను చదువుకొని, జ్ఞానం కలిగికూడ ఆమెను ఎందుకు బాధించడం? ఇటువంటి మూర్ఖపని చేస్తే యింక చదువుకొన్నందువల్ల లాభం ఏముంది-ఆమెను అప్పుడే తన హృదయంలో చేర్చుకొంటాను - అంటూ ఆమెను పిలవపోయాడు; కాని పేరు ఏమిటో

తనకే తెలియదు, తండ్రినయినా అడిగాడు కాదు. వెంటనే ముంచందిగి ఆమె వెనకాల నిలపడ్డాడు. ఆమె ముఖము అతనికి సమంగా అగుపడలేదు. ఆమె క్రిందకు వంచుకొనివున్న తలను చేతితో పైకి ఎత్తేడు. ఆ ముఖంచూచి నిర్ఘాంతపడి నిలపడిపోయాడు. "ఏండాక్టరు బాబు! నన్ను చూస్తే ఆశ్చర్యంవేస్తోందా? అవును నన్ను చూస్తే మీకు ఆశ్చర్యమే – నేనొక పల్లెపశువుని" అంటూ ఆమె నవ్వింది. "ఏంటి ఇది నిజమా? లేక స్వప్నమా? నిజంగా నాభార్యవు నీవేనా" "ఏంకాదనుకొంటూ వున్నారా?" "అవును ఎలా అనుకొంటాను. నీవు ఇంత చదువు, చదువుకొంటున్నావని ఎవరు చెప్పలేదే? ఆఖరికి నీవయినా నన్ను కలుసుకొన్నప్పుడు ఎందుకు చెప్పలేదు?" "ఏమని చెప్పాలి? నేనే మీ మామ కూతురు ప్రమీలననా? పోనీ మీరయినా చెప్పారా నేను మీ అత్తకొడుకు శ్రీధర్ నని" 'ఓ అదా నీవే మామామ కూతురువని అప్పుడే నాకు తెలిస్తే నిన్ను యింతవరకు ఒదులుదునా?అప్పుడే అమాంతముగాఇలా నాచేతులలోబంధించేయనూ' అంటూ ఆమెను తన చేతులలోకి తీసుకొన్నాడు. "నా భార్య ఏమిచదవలేదని అనుకొన్నానుకాని నీవు నాతోటి సమంగా డాక్టరు చదివేవు, ఈ సంగతి నాన్నగారయినా చెప్పలేదే?" "మానాన్నగారు ముందర చదివించదలచుకోలేదు పల్లెటూరి ఆడవాళ్లు చదువుతే ఎవరయినా ఆక్షేపిస్తారని నాన్నగార్కి భయంవేశింది. మీ నాన్నగారు 'మా అబ్బాయి చద కొంటున్నాడు, మీ అమ్మాయినికూ చదువులో ప్రవేశపెట్టవలెనని, మీ చదువు చెప్పించకపోతే మా శ్రీధ చేసుకోమని, చదువుచెప్పిస్తే తప్పక చే కొంటామని' ఉత్తరం వ్రాసారట. అం చేత అప్పటినుండి మా పినతల్లిగారు మ( సులో వుండుటచేత అక్కడనేయుండి చ వుకొనుచున్నాను. నేను చిన్నపిల్లప్పు ఇక్కడకువచ్చిన కారణంచేత మిమ్మల ఎప్పుడు చూడలేదు. కాని మావా మీరు చాల సుందర పురుషులని, మం హృదయంకలవారని చెప్పుకొనుటచేత : మనస్సు మీయందే లగ్నమయింది. "ప్రమీలా!నన్ను చూడకుండగా ఎలాపెం చేసుకొందామని అనుకొన్నావు. ఒకవే నేను అందవిహీనుడను అయితే నీవు నన్ను పెండ్లిచేసుకోనేదానివా" "మీరు చా తప్పుగా తలుస్తున్నారు. స్త్రీ ఎప్పుడుయి మనసార ప్రేమిస్తుందో వానినే కో తుంది, అతని రూపురేఖలను ప్రేమించదు ఎప్పుడు పవిత్రముగల హృదయాన్నే స్త్రీ కోరుతుంది" "ప్రమీల నీవంటి ఆదర్శస్త్రీ పెండ్లిచేసుకొన్నందులకు నేనెంతో ధన్యుడ నయ్యాను" 'ఏం నేను పల్లెపశువునేమో? 'కాదు ప్రమీలా నీవు ఇప్పుడు పట్నవాసపు పశువువే' అంటూ ఇద్దరు నవ్వుకొన్నారు. వారి మాటలు, నవ్వులు బయట తండ్రులు విని సంతోషించారు.

---




## గనుసుగడ్డ చెట్నీ

గనుసు గడ్డల్ని బాగా కడిగి సన్నబిళ్లలుగా తరుక్కోవాలి. ఈ ముక్కల్ని నేతిలో వేయించి, తగినన్ని పచ్చిమిరపకాయలు, కొతిమేరాకు, చింతపండు, వుప్పు, కాస్త పసుపు వేసుకొని మెత్తగా రుబ్బుకోవాలి. తర్వాత కొంచెం తిరగబోత పెట్టుకుంటే చెట్నీ కమ్మగా నుంటుంది.

## గనుసుగడ్డ బర్ఫీ

చక్కగా కడిగిన $\frac{1}{4}$ వీశ గనుసుగడ్డల్ని కొబ్బరికోరతో తురుముకోవాలి. తర్వాత దాన్ని ఓగిన్నెలో వేసి, గరిటెడు నేయిపోసి, బాగా వేయించుకోవాలి. తర్వాత దానిలో ఓ అరకప్పు పాలుపోసి, $\frac{1}{4}$ వీశ చక్కెరవేసి కలియబెట్టుతూ రావాలి. చక్కెరపాకం చిక్కగను, బంకగను రాగానే దాన్నితీసి, నేయి పూసి వుంచిన పళ్లెంలో కుమ్మరించుకోవాలి. ఆరిన తర్వాత బిళ్ళలుగాకోసి తినవచ్చును. -

అల్లూరి సోదరి

## పచ్చి జీడిపప్పుల కూర

సముద్రతీర ప్రాంత్యాలలో జీడిమామిడితోటలు విస్తారము. కాబట్టి ఆ ప్రాంత్యములలో పచ్చిజీడి గింజలు దొరకును. బాగా ముదిరిన పచ్చిజీడి గింజలను కాయలనుండి విడదీసి నిలువుగాతరిగి అందులోని పప్పుబద్దలను వేరుచేసి నీళ్ళగిన్నెలోనుంచుకొనవలెను. కావలసినన్ని ఉల్లిపాయ ముక్కలనుతరిగి యుంచుకొనవలెను. వానితో కలుపుటకు వంకాయముక్కలు కావలసియున్నచో తరిగియుంచుకొనవలెను. బాణలిలో నెయ్యిగాని, నూనెగాని వేసి పొయ్యిమీదనుంచి అందులో తుంచిన రెండు ఎండుమిరపకాయలు, జీలకర, ఆవాలు, మెంతులు వేసి చిటపట మనునప్పుడు ఉల్లిపాయల ముక్కలు, వాని వెంబడి వంకాయముక్కలు, తీసియుంచిన పచ్చిజీడి పప్పుబద్దలు అందులోవేసి, తగుమాత్రంగా ఉప్పు, కొద్దిగా పసుపుచల్లి బాగాకలిపి కొద్దిపాటి శగతో బాగా మగ్గునట్లుంచవలెను. తర్వాత దించి అన్నసాధకముగా వాడినచో చాల రుచిగా నుండును.

పచ్చిజీడిపప్పుబద్దలను, ఉల్లిపాయ ముక్కలను మాత్రము కూరవండవచ్చును. లేదా నానబోసిన పచ్చి శనగపప్పు, జీడిపప్పు బద్దలను, ఉల్లిపాయ ముక్కలనుకలిపి కూరవండవచ్చును. ఆహారమును పుష్టికరమైనదిగా చేయుసాధకములలో నివి కొన్ని.

## జీడిమామిడిపండ్ల పులుసు

జీడిమామిడితోటలుండు ప్రదేశములలో పండ్లు చాల చౌక. పండ్లను పిన్నలు, పెద్దలు తింటుంటారు.

చింతపండు పులుసును చిక్కంగాకలిపి అందులో ఉప్పు, పసుపుపొడి, కొద్దిగా కారం, మెంతిపిండి వేసి అందులో జీడిమామిడిపండ్ల ముక్కలు తరిగివేయవలెను. అందులో కావలసియున్నచో ఉల్లిపాయ

ముక్కలుకూడ వేయవచ్చును. ఇవన్నీకల గిన్నెను పొయిమీద పెట్టి కొద్దిగా ఇంగువపోపు చేర్చవచ్చును. పులుసు ఒకటి, రెండుసార్లు తెర్లగానే దించి తిరుగపోతపోసి వాడుకొనినచో చాల రుచిగాను, అన్నహితవుగా నుండును.

చిప్రకుల లక్ష్మీపున్నయ్య



ఆలయ ప్రాంగణము

# అనుభవము

మూలం : ప్రేమ్ చంద్

అనువాదం : శ్రీ భాగవతుల సుబ్బారావు

ఆయనకు ఒక సంవత్సరము కఠినశిక్ష వేశారు. చేసిన అపరాధమేమంటే, జ్యేష్ఠ మాసపు నడియండలలో, మధ్యాహ్న కాలమందు, తపించుచున్న రాష్ట్రీయ సేవకులకు షర్బత్, పానీయములతో సత్కారము చేసారు. నేను అప్పుడు కోర్టులో వున్నాను. గదిబయట కట్టియుంచబడిన పశుల మాదిరిగా నిల్చొని రాజకీయ చైతన్యులు గోలచేస్తున్నారు. నాప్రాణ ప్రియుణ్ణి సంకెళ్ళతో బంధించి తీసుకొని వచ్చారు. నాలుగువైపులా నిశ్శబ్దము ఆవరించియున్నది. ప్రాణము ఎగిరిపోతున్నదా అన్నట్లు నా లోలోపల దుఃఖము పొంగిపోవుచున్నది. అలలవలె లేచిన ఆ వేశముచే, శరీరముయొక్క సమస్త రోమములు నిక్కపొడుచుకున్నట్లు చేయుచున్నది. అబ్బా! ఇంతగర్వము యింతకు ముందెప్పుడు నాకు కలగలేదు. ఆ కోర్టులో కుర్చీమీద కూర్చునియున్న ఆంగ్లేయ ఆఫీసరు, ఎర్రటిఅంచులుగల టోపీలు ధరించిన పోలీసు ఆఫీసర్లు మొదలగువారందరు, నాకళ్ళముందు తుచ్ఛులుగా కనపడ్డారు.

పరిగెత్తుకొని వెళ్ళి ప్రాణ ప్రియుని యొక్క పాదములు కౌగిలించుకుందాము- మరియు ఆదశయందే ప్రాణత్యాగము చేసేద్దాము, అని మాటిమాటికి మనస్సులోఅనుకునేదాన్ని. ఎంత శాంతము! తేజస్సు! మరియు ఆత్మాభిమానములతో నిండియున్నమూర్తి! బాధ దుఃఖములేక ముఖంమీద ఆనంద సంభ్రమాలు తాండవిస్తున్నవి. ఈ చిన్న అపరాధముకొరకు ఒక సంవత్సరము కఠినకారాగారవాసమా! ఎక్కడిన్యాయము! నేను యిటువంటివి వెయ్యి అపరాధములు చేయుటకు సిద్ధముగా నున్నాను. ప్రాణప్రియుడు వెళ్ళేటప్పుడు ఒక్కసారి చూచి నవ్వునవ్వారు. వెంటనే వారి ఆకారము గంభీరమైనది. కోర్టునుంచి బయటకు వచ్చి నేను అయిదు రూపాయిల మిఠాయి తెప్పించి స్వయం సేవకులను పిలిచి తినిపించాను. మొట్టమొదటిసారి సంధ్యాసమయమున కాంగ్రెసు సంఘమునందు చేరాను - చేరటమేకాదు, స్టేజీలు ఎక్కి ఉపన్యాసాలు యిచ్చాను, మరియు సత్యాగ్రహ ప్రతిజ్ఞతీసుకున్నాను. నా ఆత్మలో యింతశక్తి ఎక్కడనుంచి వచ్చిందోమటుకు చెప్పలేను. సర్వస్వము పోయినతరువాత అసలు భయమేమిటికి? ఎవరని సందేహమేమిటికి? బ్రహ్మదేవుని

యొక్క కఠోరమైన వ్రాతకూడా యిప్పుడు నాకేమి హాని చేస్తుంది?

౨

మరుసటిదినమున నేను రెండు టెలిగ్రాములు పంపించాను. ఒకటి తండ్రిగారికి రెండవది మామగార్కి. తండ్రిగారు ఆట వికశాఖయందు మంచి పదవిలోనున్నారు. కాని రోజు గడచినను టెలిగ్రాములకు జవాబులేదు. మరుసటిరోజుకూడ జవాబు లేదు. మూడవరోజున యిద్దరు మహాశయులనుండి రెండు వుత్తరములు వచ్చినవి. ఇద్దరు మంచి కోపములో నున్నారు. మామగారు వ్రాశారు-"నా వార్ధక్యంలో నన్ను పోషిస్తారని ఆశ పెట్టుకున్నాను. నా ఆశ నిరాశయింది. నేను బిచ్చమెత్తుకొని తిరగమనేనా మీరు కోరేది? నేను గవర్నమెంటువారినుండి పెన్‌షన్ పొందుతున్నాను. నీకు ఆశ్రయమిచ్చి ఆ వచ్చే నాలుగు కాళ్ళనిగూడ పోగొట్టుకోమంటావా?" తండ్రిగారి మాటలు యింత కఠినముగా లేవుగాని సారాంశము మాత్రం దాదాపు ఈ తీరుగానే వున్నది. ఈ సంవత్సరము వారికి గ్రేడ్ దొరకుతుంది. ఒక వేళ నన్ను తన దగ్గర వుంచుకుంటే గ్రేడ్ పోగొట్టుకునే పరిస్థితి ఏర్పడుతుంది. రెండు వుత్తరములు చింపేసి అవతల పారేశాను. మళ్లీ వుత్తరం అన్న మాట వ్రాయలేదు. హా! స్వార్థం, నీ మాయ ఎంత తీవ్రమైనది! తన స్వంత తండ్రే కేవలం స్వార్థంవల్ల భయపడి కన్న కూతురుయెడల యింత నిర్దయుడైనాడా! తన స్వంత మామగారే కోడలియెడల యింత విభేదముతో వుంటాడా! కాని యిప్పుడు నావయస్సు ఎంత? ఇప్పుడింకా ప్రపంచమంతా చూడాలి.

ఇంతవరకు నేను నావిషయమై స్థిరంగా నిశ్చయించుకోనలేదు. ఇప్పుడీ క్రొత్త చింత నెత్తిమీద పడ్డది. ఈ నిర్జన గృహంలో, నిరాధారముగా, నిరాశ్రయంగా ఎలా వుంటాను? ఒక వేళ మగవాడినైతే కాంగ్రెసు ఆశ్రమములో చేరేదాన్ని; లేకపోతే కూలీచేసుకునేదానిని. నా కాళ్ళు స్త్రీత్వం అనే సంకెళ్ళతో బంధింపబడినవి. నా రక్షణ విషయమై యింత చింతలేదు, కాని నారీత్వం అనే విషయము చిక్కువచ్చింది. నా ప్రాణం విషయములో నాకు చింతలేదు, కాని నా నారీత్వం కొంత దుర్బలనుగాచేసినది.

ఏదో చప్పుడువిని క్రిందికి చూచాను. ఇద్దరు మనుష్యులు నిల్చునివున్నారు.'ఎవరు మీరు? ఇక్కడ ఎందుకు నిల్చున్నారు?'- అని అడుగుదామని మనసులో అనుకున్నా. కాని ఈ విషయమునుగూర్చి అడగటానికి నాకు ఎక్కడ హక్కుంది - అని వెంటనే జ్ఞాపకము వచ్చింది. పబ్లిక్‌రోడ్డు ఎవరిష్టమొచ్చినట్లు వారు నిల్చుంటారు.

కాని నా మనస్సులో ఏదో భయంగానేవుంది. ఆ చింత మనసునుండి ఎట్లాపోతుందో తెలియటంలేదు. అది ఒక నిప్పురవ్వలాగా ఎగిరివచ్చి హృదయంలో చేరింది.

ఎండలచే వళ్ళు మండిపోతున్నది. అయినప్పటికి యింటివాకిలి మూసేసుకొనే లోపల వున్నాను. ఇంటిలో ఒక పెద్ద కత్తివున్నది. దానిని తీసుకొని తలగడ క్రింద పెట్టుకున్నాను. ఆ చింత ఎదురుగా వచ్చి భయపెడుతున్నట్లుగా నున్నది.

ఎవరో పిలిచారు. నా రోమములు నిక్కపొడుచుకున్నవి. ద్వారం దగ్గర చెవిపెట్టాను. ఎవరో యింటి తలుపు తడుతున్నారు. గుండెదడ ఎక్కువై పోయింది. ఆ యిద్దరు దుర్మార్గులే అయి వుంటారు. ఎందుకు తట్టుతున్నారు? నాకు ఎక్కడలేని కోపం వచ్చింది. నేను తలుపు తెరవకుండా డాబామీదే నించుని అడిగాను - "తలుపు తట్టేది ఎవరు?"

శబ్దమువిని నామనస్సుకు కొంత శాంతి నిచ్చింది. ఎంతో ధైర్యం వచ్చింది. వారు బాబు జ్ఞానచందుగారు. నా భర్త యొక్క స్నేహితులలో వీరికంటే ఎక్కువ మర్యాదస్థులు యింకెవరులేరు. నేను క్రిందికివెళ్ళి తలుపు తీసాను. చూస్తే వారితో ఒక స్త్రీ గూడవుంది. వారు జ్ఞానచందుగారిభార్య. వారు నాకంటే పెద్దవారుగా వున్నారు. ఇదే మొదటి సారి నా యింటికి రావటం. నేను వారికి పాదస్పర్శచేసాను. మాలో స్నేహం పురుషులవరకేగాని, స్త్రీలవరకుపోదు.

ఇద్దరు పైకివచ్చారు. జ్ఞాన్‌బాబు గారు ఒక స్కూలు పంతులు. మంచి ఉదార స్వభావులు, విద్యావంతులు, కపటములేనివారు. ఆమె చేష్టలలో ఎంత గాంభీర్యము! నిజంగా రాణిలాగా వుంటుందంటే నమ్మవచ్చు. శరీర మపాదమస్తకమునగల ధరించియున్నది. మొఖం అందముగా లేనప్పటికి ఆకర్షణీయంగానున్నది. నేను ఆమెను ఇది వరకెన్నడైనా చూచివుంటే మొహం ముడుచుకునేదానిని. మంచి గర్వముగల మనిషి. కాని బయట ఎంత కఠోరమో లోపల అంత శాంత స్వభావురాలు.

"ఇంటికేమైనా వుత్తరములు వ్రాశావా?" - కొంచెం సంశయముతో అడిగింది.

"వ్రాశాను" - అన్నాను.

"ఎవరైనా తీసుకోవెళ్ళటానికి వస్తున్నారా?"

"లేదు. అటు తండ్రిగారు తన దగ్గర వుంచుకొనుటలేదు, ఇటు మామగారు అంతకన్నా."

"అయితే"

"అయితే ఏముంది! ఇప్పటికి ఇక్కడే వుంటున్నాను."

"అటువంటప్పుడు మా ఇంటికి ఎందుకు రాకూడదు? వంటరిగామటుకు నేను, నిన్ను ఈ ఇంట్లో వుండనీయను. సి. ఐ. డీలు యిద్దరు ఎల్లప్పుడూ బయట నక్కియుంటున్నారు."

"నేను మొదట్లోనే అనుకున్నా ఆ యిద్దరు సి. ఐ. డీ లయి వుంటారని."

"అయితే నేనువెళ్ళి జట్కాపిల్చుకొస్తాను"-అని భార్య అనుజ్ఞకోరకా అన్నట్లుగా అడిగారు జ్ఞాన్‌బాబుగారు.

ఇంకా మీరిక్కడే వున్నారా - అన్నట్లుగా చూచింది ఆమె.

మాష్టరుగారు నిశ్శబ్దముగా ద్వారము వైపు వెళ్ళారు.

"ఆగండి ఎన్ని జట్కాలు తీసుకొస్తారు"-అని దేవి అడిగారు.

"ఎన్ని!" తడబడుతు అడిగారు మాష్టరుగారు.

"హాఁ, ఎన్ని! ఒకదాంట్లో మనం ముగ్గురం కూర్చుంటామా, పెట్టె, పక్క, బిందెలు, చెంబులు, నా నెత్తి మీదకు వస్తాయా?"

"ఐతే రెండు పిల్చుకొని వస్తాను." మాష్టరుగారు భయపడుతూ అన్నారు.

"ఒకదాంట్లో ఎన్ని సామాన్లు పెడతారేం!"

"అయితే మూడు తీసుకొస్తాను?"

"మరి త్వరగా బయలుదేరండి. ఒక్క మాటకొరకు గంటలతరబడి చేసారు."

నేనేమి చెప్పకుండానే జ్ఞాన్‌బాబుగారు వెళ్ళారు. సంకోచిస్తూ అడిగాను-"అక్కగారూ నేను రావటం, మీకు కష్టంగలిగించవచ్చు, మరియు ..." దేవిగారు తీక్షణంగాచూస్తూ అన్నారు-"ఐతే కావచ్చు. నీవు రెండు పూటలా ఒక పావుపిండి తింటావు. గదిలో ఒకమూల నివాస మేర్పరుచుకుంటావు, తలకి రెండులేక మూడు అణాల నూనె రాచుకుంటావు. ఈ కొంచెమేనా కష్టము?"

నేను సిగ్గుపడుతూ అన్నాను-"మీరు నన్ను తెలివితక్కువ దాన్నిగా చేస్తున్నారు."

దేవిగారు స్నేహభావంగా నామెడ పట్టుకుని, - "మీ భర్తగారు తిరిగివచ్చిన తరువాత, అప్పుడు నన్నుగూడ నీ యింట అతిథిగా పెట్టుకో. నాకు కలిగినే నష్టం తీరిపోతుంది. ఏం, ఇప్పటికి రాజీ కుదిరిందా? పద సామాను అంతా సర్దుకో.

మంచం గించం రేపు తెప్పించుకుందాం" అన్నారు.

3

ఇటువంటి సహృదయము, ఉదారము, స్నేహభావము, తియ్యటి పలుకులు పలికే స్త్రీని, నేను ఎక్కడా చూడలేదు. నేను ఆమె, చిన్న చెల్లెలు అయివుంటే, బహుశా యింతకన్నా యెక్కువగా వుండదు. ఆమె మొఖముమీద యెల్లప్పుడు కళాకాంతులు తొణికిసలాడుతూ వుంటవి. ఎవరూ పిల్లాజెల్లా లేకపోయినప్పటికి, ఆమె విచారముగా వుండటం యింతవరకూ చూడలేదు. పైపనుల కొరకు ఒక నౌకరును పెట్టుకున్నారు. ఇంట్లో పనులన్ని స్వంతంగా చేసుకుంటుంది. విశ్రాంతి అనే మాట ఆమె గీతలోలేదు. నడివేసవి యెండల్లో గూడ నిద్రపోదు. నిజంగా, నన్ను ఒక్క పని ముట్టుకోనివ్వదు. ఎప్పుడుచూచినా యేమైనా తినిపించటానికి నెత్తిమీదయెక్కి కూర్చుంటుంది. ఇదితప్ప యింకేకష్టముండేదిగాదు నాకు.

ఎనిమిది రోజులు గడచినవి. ఒక రోజున, ఆ యిద్దరు, సి. ఐ. డీలు క్రింద కూర్చుని వుండటం చూచాను. నా మనస్సుకు కష్టంకలిగింది. ఈ నిర్భాగ్యులు చివరకు యిక్కడగూడ చేరారు. నేను వెంటనే అక్కగార్ని అడిగాను - "ఆ యిద్దరు దుర్మార్గులు ఇక్కడగూడ తిరుగుతున్నారు."

ఆమె ఈర్ష్యాభావము ప్రకటించుతూ- "కుక్కలు-తిరగనీ" అని అన్నది.

"ఏమికుట్ర లేవదీయురుగదా" - అదుర్దాగా అడిగాను.

"మొరగటంతప్ప ఇంకేమిచేస్తారు"- నిష్కర్షగా అన్నది.

"కరుస్తారుగదా" - అన్నాను చిరునవ్వుతో.

నవ్వుతూ అన్నది-"వీళ్లనుచూచి భయపడి యెవ్వరు పారిపోవటంలేదుగా"

అయినప్పటికి నాకు కష్టం కలగటం మొదలు పెట్టింది. మాటి మాటికి మేడమీదకువెళ్లి వాళ్లు తిరగటంచూచి వచ్చేదాన్ని. వీరంతా నావెనక యెందుకుపడియున్నారు ? ఆఖరికి నేను గవర్నమెంటు వారికి యేమినష్టం కలిగించాను ? అసలు నా సామర్థ్యమేమిటి ? ఎందుకు, వీళ్లందరుకలిసి నన్నిక్కడనుండి వెళ్లగొట్టటానికి తయారుగా వున్నారు ? దీనివల్ల వాళ్లకు వచ్చేదేమిటి ? నేను ఇంటింటికి తిరగటమేనా ? ఎంత నీచమైన పరిస్థితి యేర్పడింది!

అట్లాగే ఒకవారం గడిచిపోయింది. సి. ఐ. డీల పీడా వదల్లేదు. ప్రాణం

తియ్యాలని చూస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో ఇక్కడ వుండటం నాకు అనుచితంగా తోచింది, కాని దేవిగారితో యేమి చెప్పలేకపోయాను.

ఒక రోజు సాయంత్రం జ్ఞాన్‌బాబు గాబరాపడుతూ వచ్చారు. నేను వరాండాలో కూరగాయలు తరుగుతున్నాను. జ్ఞాన్‌బాబుగారు గదిలోకివెళ్లి చూపులతో దేవిగార్ని పిలిచారు.

దేవిగారు కూర్చునే అన్నారు—"ముందర మొఖం చేతులు కడుక్కొని కొంచెం తిన్న తరువాత, అప్పుడు చెప్పేదేదో చెప్పండి."

జ్ఞాన్‌బాబుగార్కి ధైర్యమెక్కడ? కడుపులో ఆ విషయముయొక్క తీవ్రత పచనముకావటంలేదు. పట్టుదలతో పిలిచారు.

"నీకు చూస్తే నవ్వులాటగవున్నది, ఇప్పుడు నా ప్రాణం మీదకు వచ్చింది"—అన్నారు.

దేవిగారు కూర్చునే అన్నారు—"అయితే ఆ చెప్పేదేమిటో చెప్పరేం?"

"ఇక్కడికిరా"

"ఏం, ఇక్కడ యింకెవరైనా కూర్చొని వున్నారా?"

నేను అక్కడనుంచి బయలుదేరాను. అక్కగారు నా చెయ్యి పట్టుకున్నది. నేను ఎంత ప్రయత్నించినప్పటికి వదలించుకోలేకపోయాను. జ్ఞాన్‌బాబుగార్కి నా యెదట చెప్పటం యిష్టంలేదు.

"ప్రిన్సిపాల్ గారితో నాకు పోట్లాట జరిగింది"— అన్నారు.

దేవిగారు గంభీరముగా "నిజంగానా! మీరు వారిని బాగా కొట్టారా" అన్నది.

"నీకు ఎగతాళిగా వున్నది. ఇప్పుడు వుద్యోగం పోయేటట్లున్నది"

"మరి ఆ భయం వున్నప్పుడు ఎందుకు పోట్లాడారు?"

"నేనేమి పోట్లాడలేదు. వారేనన్ను పిలిచి బెదిరించారు."

"నిర్దోషి"

"ఇంక నేను నీతో ఏమి చెప్పేది?"

"మళ్లీ అదేమాటా? నేను చెప్పనే చెప్పాను. ఆమె నా చెల్లెలు, దీంట్లో ఏమి రహస్యందాచను."

"ఒకవేళ ఈమెనుగురించే ఆ విషయమైతే?"

"ఆ దా— తెలిసింది. సి. ఐ. డీల ఆచూకీతో పోలీసులు, మీ ప్రిన్సిపాల్‌కి కంప్లైంట్ చేసి వుంటారు."

'పోలీసులు, ప్రిన్సిపాల్‌తోగాదు, జిల్లా విద్యాధికారికి చెప్పారు. వారు ప్రిన్సిపాల్

గారిని పిలిచి నాదగ్గర సంజాయిషీ తీసుకోమని ఆజ్ఞ యిచ్చారు.'

దేవిగారు - "తెలిసిపోయింది. ప్రిన్సిపాల్ గారు, ఆస్త్రీని మీ యింట్లోనుంచి పంపివేయండి, అనివుంటారు."

"ఆ, అదేననుకో"

"అయితే మీరేమి జవాబు చెప్పారు?"

"ఇప్పుడేం సమాధానమివ్వలేదు. అక్కడ నిల్చోండి ఏంచెబుతాను."

దేవిగారు వారిని నిందించటం మొదలుపెట్టారు —

"ఏ ప్రశ్నకైతే ఒక్క సమాధానముందో దానికి విచారించటమేమిటి?"

"అయినప్పటికీ కొంచెం ఆలోచించటం అవసరముగదా" అని వెటకారంగా అన్నారు.

దేవిగారికి కోపంవచ్చింది. ఇవ్వాళే మొట్టమొదటిసారిగా ఆమెయొక్క ఆ రూపం చూశాను. "మీరు పోయి ఆప్రిన్సిపాల్ గారితో చెప్పండి, నేను ఆమెను ఏ పరిస్థితులలోనూ విడిచిపెట్టను. ఏనకపోతే రాజీనామా యిచ్చేసిరండి. ఇప్పుడే వెళ్ళండి. తిరిగివచ్చి కాళ్లు చేతులు కడుక్కొందురుగాని."

"అక్కగారూ నామూలంగా..." అని ఏడుస్తూ చెప్పాను.

దేవి నామాటకు అడ్డు తగిలింది. — "నీవు నోరుమూసుకో లేకపోతే చెప్పు మెలేస్తా. మధ్యలో నీవెందుకు దూకుతావు? ఉంటే యిద్దరం వుందాం, చస్తే యిద్దరం చద్దాం. ఈ అసమర్థులైనవారికి ఏంచెప్పేది? వళ్ళు సగానికి పైబడ్డాయి, యిప్పుడు మాట్లాడటం చేతకాదు! (భర్తవైపుతిరిగి) "నిల్చోని ఏమిటి ఆలోచిస్తున్నారు? మీకు భయంగావుంటే నేనుపోయి చెప్పివస్తా?"

జ్ఞాన్‌బాబు సిగ్గుపడుతూ అన్నారు— "అయితే రేపు చెప్తాను. ఇప్పుడు .క్కడౌతుందీ, గొడవ"

"రాత్రిఅంతా నాకు నిద్రపట్టలేదు. తండ్రిగారు, మామగారు, ఎవరిముఖమైతే చూట్టానికి యిష్టపడలేదో, అటువంటి దానికా యీయాదరణ! రోడ్డుమీద అడుక్కునేదానికా ఈ గౌరవము! దేవీ! నీవునిజంగా దేవతవమ్మా!"

రెండవరోజు జ్ఞాన్‌బాబు వెళ్ళేటప్పుడు మళ్ళీ దేవిగారు అన్నది - "ఏదో తేల్చుకొని మరీయింటికిరండి. మళ్ళీ ఆలోచించి జవాబిచ్చే అవసరమేమిలేకుండా వుండాలి."

జ్ఞాన్‌బాబు వెళ్ళిన తరువాత అడిగాను— "మీరు నాకొరకు చాల అన్యాయము చేస్తున్నారు అక్కగారు. నా మూలంగా

మీకు యీకష్టం రావటం నేను చూడలేను.''

దేవిగారు హాస్యంగా అన్నారు - ''అయిందా చెప్పటం, లేక యింకేమైనా చెప్పాలా?''

''అయింది, కాని యింకా కొద్దిగా చెప్పాలి.''

''సరేగాని, నీభర్త జైలుకు ఎందుకు వెళ్ళారో చెప్పు? స్వయం సేవకులకు సత్కారము చేసినందుకేనా? స్వయం సేవకులు ఎవరు? వారు మన స్వాతంత్ర్య యుద్ధాలలో పోట్లాడే వీరులు. స్వయం సేవకులకుగూడ పిల్లా జెల్లా వుంటారుగా, తల్లి తండ్రి వుంటారుగా; వారుకూడ ఏదో ఒకపని చేస్తూవుంటారుగా; కాని దేశము కొరకు పోట్లాడటానికి వారు సమస్తము విడిచిపెట్టారు. ఇటువంటి వీరులకు సత్కారము చేసినటువంటి మనుష్యుని జైల్లో వేశారు. ఆయన భార్య దర్శనమే ఆత్మను పవిత్రం చేస్తుంది. నేను నీమీద దయ చూపటం లేదు, నీవే నా మీద దయ చూపుతున్నావు.''

''.......................''

సాయంత్రము జ్ఞాన్‌బాబు తిరిగి వచ్చారు. వారి మొఖంమీద ఆనందం పొడగట్టింది.

దేవిగారు అడిగారు-'కాయా-పండా?'

జ్ఞాన్‌బాబుగారు గట్టిగా అన్నారు - ''పండే''! నేను రాజీనామా యిచ్చాను. వాళ్ళు భ్రమ పడ్డారు. వారు వెంటనే జిల్లా విద్యాధికారి దగ్గరకు వెళ్ళారు. మరి అక్కడేం జరిగిందో ఏమో, యిద్దరూ మోటార్లో కూర్చుని మాట్లాడుకున్నారు. తిరిగి వచ్చి అడిగారు - ''మీరు రాజకీయ ఉపన్యాసాలలో పాల్గొనరుగదా?''

''లేదు.'' అన్నాను.

''కాంగ్రెస్ మెంబరు కాదుగదా?''

''కాదు''

''కాంగ్రెస్ ఫండుకు చందా యివ్వరు గదా?''

''లేదు''

''అయితే మిమ్ములను మేము ఏమి యింక అడిగేవనేవిలేదు. నేను మీ రాజీనామాను అంగీకరించడంలేదు. యథాప్రకారం పనిచెయ్యండి''

దేవి ఆనంద పారవశ్యంతో నామెడను చుట్టేసుకొంది.



# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

ఇప్పుడు మనకు దొరుకుతూన్న జానపద గేయాలలో అప్పటివేవో నిర్ణయించడం దుస్సాధ్యమైన పని. గ్రాంథిక గ్రంథాలు మత విప్లవాలలో నశించేయి. కాలిపోయిన గూడెమును పట్టుకొని అక్కడ ఇళ్ళు లేవని చెప్పడమెట్లాటిదో, అప్పటి కాలంలో గ్రంథాలు లేవని చెప్పడమూ అట్లాటిదే!

### నూతన, మతాలు వాఙ్మయాలు

పదకొండో శతాబ్దం ప్రారంభంలో వైదిక వాఙ్మయం విజృంభించడం మొదలు పెట్టింది. ఆంధ్రదేశంలో రాజనరేంద్రుడు దీనికి పట్టుగొమ్మ అయ్యేడు. ఆ కొమ్మకి చేవకలిగించిన మహానుభావుడు నన్నయభట్టు. మహాభారతం పంచమవేదమై తెలుగులోకి అవతరించవూనుకొంది. సంస్కృతం నుంచి రావడంబట్టి భావాలతోపాటు ఛందస్సు, భాషకూడ దిగుమతయింది. ఆంధ్ర మహాభారతం మిశ్రమ విధానంలో రచించబడ్డ ఒక గ్రంథం. అద్వైత మతావలంబులు ఈ మార్గాన్ని చేబట్టేరు.

క్రీ. శ. 1150 ప్రాంతంలో బసవేశ్వరుడు వీరశైవ మతాన్ని స్థాపించేడు. దీనిని ప్రజలకు బోధింపదలచేరు కొందరు అనుయాయులు. జనులకు సన్నిహితంలో ఉండే దేశిలక్షణాలలో గ్రంథాలను రచించి ప్రచారం చేయదలచేరు. మల్లికార్జున పండితుడు (క్రీ. శ. 1160-70) దేశి కంద పద్యాలలో శివతత్త్వ సారము అను వేదాంత గ్రంథాన్ని రచించేడు. అతను కొన్ని రగడలు, గద్యాలుకూడ రచించేడు.

పాల్కురికి సోమనాథుడు (క్రీశ 1180-1220) గొప్ప ప్రచారకుడు. దేశిద్విపదయొక్క పటుత్వాన్ని గ్రహించేడు. వేలకొద్దీ గేయాలు జానద్విపదలో ఉన్నాయి. ఆ లక్షణానికి సమీపమైనది దేశిద్విపద. కాబట్టి ఆ లక్షణంలో బసవపురాణం, పండితారాధ్య చరిత్రలను సృష్టించేడు. అంతేగాక దేశిఛందస్సులు, గ్రంథ స్వరూపాలుగల ఉదాహరణ, శతకం ఇత్యాదులు రచించేరు. వీరశైవమత వాఙ్మయానికి పునాదివేసినవాడు మల్లికార్జున పండితుడైతే, దానిమీద కోటు వేసినవాడు పాల్కురికి సోమనాథకవి. ఇతను ద్విపద లక్షణానికి మహా ఘనతను తెచ్చిపెట్టేడు. దానికి అటు రాజాస్థానాలలో ఇటు జనులలోకూడ జనత కలిగిందని చెప్పవచ్చు. క్రీ. శ. 1280 ప్రాంతంలో రంగనాథుడు రామాయణాన్ని ద్విపద కావ్యంగా రచించేడు.

దేశి లక్షణాలను చేబట్టి వీరశైవకవులు పెద్ద వాఙ్మయాన్ని సృష్టించేరు. కాని ఈ మతం ప్రజలలో చెప్పదగినంతగా మాత్రం వ్యాపించలేదు.

మిశ్రమార్గ లక్షణాన్ని అవలంభించి అద్వైత కవులు గొప్ప వాఙ్మయాని సృష్టించేరు. దీనికి వచ్చినంత ప్రచారం మరి దేనికీరాలేదు. ప్రజలు అద్వైత సిద్ధాంతాన్నే చాలవరకు అవలంబించేరు.

వీరశైవులనుమాని వీరవైష్ణవులుకూడ దేశి ద్విపదలోనె కొంత వాఙ్మయాని సృష్టించేరు - పరమయోగి విలాసం, అష్టమహిషీ కల్యాణం ఇత్యాదులు. ఇట్లు వీరు మతప్రబోధానికి దేశిలక్షణాలను ఉపయోగించుకొన్నారు. అటు తర్వాత ముఖ్యంగా దేశి ద్విపద, కావ్యరచన లోకపద్ధతి అయిపోయింది. కాబట్టి భారత, భాగవత, రామాయణాదులుకూడ వెలసేయి.

జానపదగేయశాఖ అన్ని కాలాలలోను విజృంభించుతూనేఉంది. ద్విపదాదులు అటు గ్రాంథిక వాఙ్మయంలోను ఇటు జానపదవాఙ్మయంలోను కూడ ఉండడంవల్ల స్పష్టతకోసం అది జానపద లక్షణమో, దేశి లక్షణమో చెప్పవలసుంది. ఉదాహరణకోసం - 1919 మే ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో 'ద్విపద కవిత్వం' అను వ్యాసముంది. దీనిలో ద్విపద రచనలని అప్పగింతలపాటలు, దక్షయజ్ఞము, సీతపాట, పుత్రకామేష్టియజ్ఞము, పార్వతీ పరిణయము, లక్ష్మణమూర్ఛ, అంగదరాయబారము, ఆత్మబోధ అనేవి ఉన్నాయి అని చెప్పబడింది. ఇల్లే మరొకచోట 1. నవచోళరాజుల కథలు 2. పాండ్యరాజులకథలు 3. పతివ్రతలకథలు 4. భళ్లాణరాజులకథలు 5. కాటమరాజుకథ 6. కరికాళచోళకథ 7. ప్రతాపచరిత్ర 8. వెలనాటి విజయము 9. పల్నాటిచరిత్ర 10. బొబ్బిలికథ చెప్పబడ్డాయి. ఆ వ్యాసంలోనె ఇంకొకచోట వేదాంత గ్రంథాలంటూ 1. మాయచిదానందమంజరి 2. అద్వైతబోధనలు 3. ప్రభులింగలీలలు 4. రాజయోగామృతసారము 5. తత్త్వానుసంధానము అను పేర్లు చెప్పబడ్డాయి. వీటిలో ఏవి జానపద ద్విపద గ్రంథాలు, ఏవి దేశి ద్విపద గ్రంథాలో సులువుగా తెలియడంలేదు.

ఆ నాటి జానపదరచనలను, దేశిరచనలను కలిపి పాల్కురికి సోమనాథకవి యిట్లు తెలియజేసేడు-

శతకంబు శివతత్త్వ సారంబు, దీప
కళిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ముక్తావళులు,
గీత సూక్తములు, భృంగీస్తవంబులు,బు
రాతన మునిముఖ్య రచితాష్టకముల
అరు దొంద జదువుచు నంకించువారు

(బసవ పురాణము )

పురాతన ముని ముఖ్యులు రచించిన ఆ అష్టకాలు ఎన్ని శతాబ్దాల కిందివో! వాటిని మనం తవ్వి పైకి తీయగలమా? ఇంతేగాక తోలు బొమ్మలు, నాటకాలు ఉండేవనికూడ అతను తెలియజేసేడు. ఇంకా -

ఆనందగీతంబు నర్థిబాడుచును శి
వానందలీలల నలరియాడుచును
శంకరగీతముకీ సరసబాడుచును

[బసవ పురాణం, మహిమ ప్రకరణం పుట 176]

అని తెలియజేసేడు. ఈ శాఖలో ఎంతటి పరిశోధన అయినా అవసరం!

## ప్రసిద్ధి

అనేక జంగం కథలలో కొన్ని సమాన సంప్రదాయాలు అనుసరించబడుతున్నాయి. కాని నల్లతంగాళ్ కథ కొంత భిన్నంగా ఉంది. ఇది రాజుల యొక్క సాంసారిక జీవనాన్ని వర్ణించేకథ. సన్యాసమ్మకథ రాజకుటుంబాన్ని గురించే అయితే నల్లతంగాళ్ కథలాగుంటుందని చెప్పవచ్చు. క్షత్రియుల కథ అనగానే అందులో యుద్ధాలుంటాయని అనుకొంటాము. కాని ఈ కథ సంసార జీవనానికి సంబంధించినది మాత్రమే.

జంగంకథలలోనైనా మొట్టమొదటికథలోఉన్న సంప్రదాయాలు చిట్టచివరిదాక మారకుండ ఉండలేదు. కొన్ని సంప్రదాయాలు నశించి కొత్తవి ఏర్పడడంకూడ కద్దు.

ఈ కథలు కల్పనకోసం బయలుదేరినవి కావు. కాని బాలనాగమ్మకథలో కల్పన పరాకాష్టను పొందింది. అంతేకాదు, ఆ కథ కొత్త దారులను తొక్కింది. ఎటువంటి కవియైన హాస్యరసాన్ని తన గ్రంథంలో ప్రవేశపెట్టడానికి జంకుతాడు. దానియొక్క ఆకర్షణ తెలిసికూడ ఉపయోగించుకోలేడు. బాలనాగమ్మకథలో అలాగుకాదు. దానిలోని హాస్యంచూస్తే కడుపు చెక్కలవవలసిందే

ఈ కథలలో ఎంతో వైవిధ్యముంది. చిన్నమ్మ యొక్క భక్త్యతిశయం, సన్యాసమ్మయొక్క విశాల హృదయం, కామమ్మయొక్క బలిదానగుణం, స్త్రీల పాతివ్రత్యం ఇత్యాదులెంతో మెచ్చతగి ఉన్నాయి. వీటిలోని సంప్రదాయాలను కొన్నిటిని నేడు మనం పాటించడంలేదు. ఈ నాడు మనం 'ఏడు' సంఖ్యను ఏడుపుతో ముడిపెడుతున్నాం. కాని ప్రాచీనకాలంలో ఆ సంఖ్యకు ఎంతో గౌరవం.

ఈ సంప్రదాయాలలో కొన్ని లోపాలు లేకపోలేదు. అతిశయోక్తులు ఒక పెద్ద లోపం. ఇది ఆ నాటి కవులలోని, ప్రజలలోని దానివల్ల నిజం మరుగునపడిపోతుంది. వ్యర్థమైన అభీష్ట చింతనే (Wishful thinking) దిక్కవుతుంది. ఏదయినా మొత్తంమీద ఈ రచనలు సమకాలంనాటి జీవితానికి ఒక రకమైన ప్రతిబింబాలు.

ఈ వాఙ్మయశాఖ దానికదేసాటి. తెలుగులో సంపూర్ణమైన ఉపజ్ఞా (Original) గ్రంథాలులేవు అనే అపవాదును తొలగించేయి. తెలుగుగడ్డలో తెలుగుదనాన్ని వెల్లడిచేస్తూన్న రచనలివి. ఈ ఉపజ్ఞా గ్రంథాలు మన వాఙ్మయానికే ఆదర్శాలని చెప్పవచ్చు. వీటిని ప్రకృతిలో నవనవలాడే గులాబి, సంపెంగ, మల్లె, మొగలి, జాజి మొదలైనవాటితో సరిపోల్చవచ్చు. అప్పటికి గ్రాంథికరచనలు అత్తరువులు వంటివి మాత్రమే అవుతాయి. సహజమగు పూలకుండే శోభ అత్తరువులకేది? సువాసన ఉండుగాక కళ్ళకానందంఏది? విద్యావంతులకు గ్రాంథిక కృతక కావ్యాలే ప్రియమయ్యేయి. రచనలో అదొక పద్ధతి అని మాత్రమే తలవలేదు. జాతిరత్నాలవంటి జానపదగేయాలు ఆదరంలేక మారుమూల పడిపోయేయి. ఇప్పటికైన ఈ వెలలేని రత్నాల గుర్తించి, పరిశోధన అవసరం.

## భాష

జంగంకథలు జీవద్భాషలోనే రచించబడ్డాయని చెప్పవచ్చు. కాని అవి రచించబడ్డ కాలంనాటి భాష మాత్రం నేడు మిగలలేదు. ఇవి పాటలుగా వస్తూన్న రూపాలు. పాటకు తమ కాలానికి తగిన వ్యాకరణం మార్పులు, భాషమార్పులుకూడ చేస్తూ వచ్చేరు. లేకపోతే అవి జనులకు అర్థంగాక మూల పడిపోతాయి. ఇట్టి మార్పులకు వీటి ఛందస్సు కూడ అనుకూలించింది. పాటకి ఒక మాత్ర ఎక్కువైనా తక్కువైనా సరిపెట్టుకోవచ్చు. కాని దేశిద్విపదలోను, దేశిరగడ ఇత్యాదులలోను రచింపబడ్డ పల్నాటి వీరచరిత్ర, కాటమరాజుకథ, దేశింగురాజు కథ ఇత్యాదులకు ఈ మార్పు గుర్తింపతగినంతగా రాదు. వాటి లక్షణం అంత సులువుగా లొంగదు.

కొన్ని జంగంకథలలో కేవలం వ్యావహారిక భాష గాక అభ్యుదయ గ్రాంథిక భాష వాడబడింది. అభ్యుదయ గ్రాంథిక భాష కట్టుబాట్లతో ఉక్కిరి బిక్కిరి కాదు. కొత్త పదాలను, వ్యావహారిక పదాలను స్వీకరించి వృద్ధిపొందుతూంటుంది. ఇట్టి భాష పల్నాటి వీరచరిత్ర, నల్లతంగాళ్ కథ, దేశింగురాజు చరిత్ర ఇత్యాది రచనలలో కనబడుతుంది.

## స్వేచ్ఛామైత్రి, స్వేచ్ఛాప్రాస

యతిస్థానంలో తప్పకుండా మైత్రి ఉండాలి అనే నియమం జానపద కవిత్వానికిలేదు. దేశిరచనలోని మైత్రి నిర్బంధమైత్రి. జానపదరచనకి నిర్బంధం లేకుండా మైత్రికుదిరితేసరి, లేకపోతే దానికోసం పాకులాడవలసినపనిలేదు. ఈ క్రింది చరణాలను చూడండి -

అత్త కట్టిన కట్టులన్నియు విప్పినాదిగా
కంకణహస్తముల తల్లి కడవలోవేసింది
వక ఇంతటి కబళము తల్లి వడ్డించబోయె
అట్టి మాటలకు స్వామి ఆలోచనచేసెను.

(చిన్నమ్మకథ)

వీటిని యతిస్థానాలగానే భావించవచ్చును. మైత్రి కుదిరితే కుదిరింది లేకపోతేలేదు.

ఈ గేయాలలో ప్రాసవిషయంకూడ స్వేచ్ఛే. దేశిఛందస్సు ననుసరించిన కవులు, వాటి లక్షణాన్ని అనుసరించి కొంచెముగా పాటించేరు. దానిలోనైన క్లిష్టతకుపోలేదు. (సశేషము)

# గృహవైద్యము

నేలవేము:—సామాన్యముగా మందు దినుసుల అంగళ్లయందు దొరకును. పూవుతో నున్నప్పుడు జాగ్రత్తపరచిన ఔషధము మంచిగుణమిచ్చును. సమూలాల మంతయు చేదుగనే యుండును.ఇంగ్లీషు వైద్యులును ఆయుర్వేద వైద్యులునుకూడ గుణకారియగుటచే సామాన్యముగ వాడుచుందురు.

కషాయముచేయుపద్ధతి:—బాగుగ యెండిన నేలవేము సమూలమును తెచ్చి నలుగ గొట్టవలయును. 1 పలమును ఒక శేరు నీళ్లలో నానవేసి మరుసటిరోజు ఉదయము పొయ్యిమీద పెట్టి 5—వ వంతు కషాయము సుమారుగచూచి దించవలయును. బాగుగ వడియగట్టవలయును. సుమారు ¼ తులము పటిక చూర్ణమునుచేసి దానిలో కలపవల యును. వేడిగనున్నప్పుడే మంచి తేనెను 2 ఔన్సులుచేర్చి శుభ్రమయిన సీసాలోవేసి జాగ్రత్తచేయవలయును.

సామాన్యముగ నిత్యము, అప్పుడప్పుడువచ్చు జ్వరములకు మంచిమందు. మోతాదు 1/8 ఔన్సు మొదలు ¼ ఔన్సువరకు రోజుకు రెండు పర్యాయములు యివ్వ వచ్చును. జ్వరము యేకారణముచేవచ్చిననూ బాగుగ పనిచేయును. ఉదరవ్యాధు లకు ఉపయోగము. మందగొట్టుతనమును పోగొట్టును; వికాసమునిచ్చును. ఆకలి మందగించుటను సరిచేయును. అజీర్ణమును హరించును. పైత్యమువల్లకలుగు తలతిరు గుడుపోయి శాంతినిచ్చును. నీరసమును దరిజేరనీయదు, ప్రేగుల కంటుకొనియుండు క్రిములను నాశముచేయును.

కె. వి. రంగా

---

(122—వ పేజీ తరువాయి)

సామాన్య ప్రజాక్షేమం మంటగలుపుతున్నారు. ఏమో మీరేమన్నా అనండి నాకు వ్యక్తిగత స్వాతంత్ర్యమే మేలుగా తోస్తుంది. మన పూర్వ ప్రభువులంతా యెంతో ప్రజానురంజకంగా పరి పాలనచేయలేదా ? నేటికి మన ఆదర్శాలు అవేగా. లోకో భిన్నరుచి అన్నారు. అందరి అభిప్రాయాలు యేకీకరణచేయడం అంత సులభ మైనపని కాదండీ.

లక్ష్మి:—సరే, బాగానే ఉన్నది. ఇంతకీ మీవరస — శ్రీరామచంద్రుడంతటివాడు సీతమ్మను తెచ్చుకో డానికి ఆ అరణ్యాల్లో సాటినరులు దొరక్కపోతే వానరులనయిన సహాయం చేసికోకతప్పలేదు.మీరు—

పద్మ:—మీరట్లా అంటే నేనేమి చెప్పగలను. లోకం అంతా భిన్నమతాలతో, సంక్షుభితం అయివున్న ప్పుడు యొవరిసహకారంకోరితే, యేమి ఆటంకం వస్తుందో అనేకదా . . గౌతమబుద్ధుడు యేకాం తంగా సన్యసించి ఘోరతపస్సుచేసి లోకకళ్యాణా నికి సాధనభూతమైన నూతన మతాన్ని అవిష్క రించాడు. వారిది మాత్రం మనకు ఆదర్శంగా

లక్ష్మి:—ఇంతకు మనవాదంవలన వ్యక్తి స్వా
పరస్పర సహకారం రెండు మన
సరమే అన్నవిషయం నిర్ధార
టాను. ఏదైనా సమయో
గించుకొనే పద్ధతిలోనే
ఏం. ఈ నా అభిప్రా
భవించి, నాకు యీ

పద్మ:—అయ్యో, నా స
నండి. కీడు మే
ప్రజాహిత కా
కర్తవ్యం ! అ

(విజయవాడ ఆలి

# విధుర హృదయము

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

అది ఏకాంత సమాలోచన. ఐహిక తాత్కాలిక భాగ్య భోగ్యాలకు తనువును అమ్ముకోవటమా! ఆముష్మిక శాశ్వత స్వర్గ సౌఖ్యాలకు శరీరాన్ని త్యాగం చెయ్యటమా. ఈ రెంటి సంఘర్షణే వరూధిని మనస్సు.

అంగసౌష్ఠవము, శరీరోద్రేకము, కామ పిపాస, జవ్వనత్వానికి సహాధ్యాయులు, శరీరంలోకి వృద్ధాప్యము చొచ్చుకొచ్చిన నాడు యివేవి తనవెంట వుండవని వరూధినికే తెలుసు. అందుకని పొంగిపొరలుతున్న, పటిష్ఠమైన యీ ప్రాయాన్ని శుష్క సిద్ధాంతాలతో వృధాగా గడిపెయ్యాలిసిందేనా? ఇదే వరూధిని ఆలోచన.

"మీరే నా సర్వస్వము అని నమ్మ
మీ చరణదాసే వరూధిన్ని విశ్వ
పోయారు. ఆడదాని హృదయము
అర్ధాంగిని అహర్నిశలు,
అనవసరమైన అపనిందలు
మాటలు అని, నిష్క
గా నిప్పులుపోశారు.
నా హృదయము
యింది!
ృంగి కృశించి
ము, జాలి, మీ

రాతి హృదయంలోకి చొచ్చుకోలేక పోయినాయి" ఇదే వరూధిని ఆవేదన.

"ఈ నాడు నాకు హితోపదేశాలు చెయ్యటానికివచ్చారు. నేను ద్రోహిని కాను. పాపినికాను. ఒక అమాయకపు అంగనను. నమ్మించి ద్రోహంచేశారు. ఇక నన్ను యెవ్వరూ మోసంచెయ్యలేరు. నా జీవిత సౌఖ్యాల్ని సిద్ధాంతాలకు, సంఘానికి బలిచెయ్యను. నేను స్వేచ్ఛాజీవిని. నన్ను అదుపు ఆజ్ఞలలో పెట్టే వ్యక్తి నన్ను వదలి వెళ్లిపోయాడు. ఈ యింట్లో వున్నంత వరకు నాకు యీబాధ తప్పదు. నాకు యీ హింస తప్పదు. రమేశ్ బావకు యీ నాటికైనా నేనంటే యెంతో ప్రేమ. డబ్బులేదనేగా-బిచ్చము యెత్తుకుంటాము; నౌకరీ చేసి పొట్ట గడపుకుంటాము. అంతే కాని నా జీవితాన్ని వృధాగా యీ నాలుగు గోడలమధ్య గడిపివెయ్యను. అడుగో రమేశ్ పిలుస్తున్నాడు. నన్నే... వస్తున్నా రమేశ్ నన్ను క్షమించు... మొదటే యీ నిర్ణయము చేసుకోవాలసింది.

కాని నీ నియమము సాగేదెట్లా! నేను రెండవపెళ్లి అమ్మాయినే చేసుకుంటాననే నీవాదము నెగ్గింది. ఇదిగో వస్తున్నా, .... రమేశ్ ..."

వరూధిని కళ్లు తెరిచింది. చుట్టూ యమదూతల్లాగ వున్నారు బంధువులు.

....ఇదిగో నేను చెప్పలా ఏదయ్యామో ఏభూతమో పట్టుకుని యిట్లా ఏడిపిస్తోంది నా తల్లిని. ఈ కర్మం వచ్చినప్పటినుంచి, యిదొకటి పట్టుకుందమ్మ అన్నది వరూధిని తల్లి ఏడుస్తూ.

'ఏభూత వైద్యునికైనా చూపించండి. ముదిరిపోతే కష్టం...' అన్నాడు ఆబంధువుల్లో వకాయన.

—o—




## వెక్కిరింత

టక్కరి బావా!
చక్కని చుక్కను
అక్కను చూచి
వెక్కిరించినావా!!
మర్కట రూపము
కర్కశ హృదయము
రక్కసిముక్కూ
కుక్కమూతీ! నీవూ!
అక్కను వెక్కిరించినావా! బలే

## పెండ్లి కూతురు

మల్లెలు మొల్లలు జడలోముడిచి
ల్లీనగలను వేసుకొని
చీరెను గట్టుకొని
పెళ్లి కూతురు
వెంటనురాగా
వెంటనురాగా
మాషాగా

షాగా!

## మౌనము

మాపాపాయి
మౌనముగా
రాను తిరిగ
గాను తొడిగి
పౌరులంత
పకపకపక
పరిహసింప
బా! బా! బా! బా!
అరచెబేపి.

## కొంటె పిల్లడు

గవ్వలాడి తిరిగి వచ్చి
అవ్వతోడ జగడమాడి
బువ్వకొరకు గర్వముగా
నవ్వు నవ్వి కవ్వముతో
కొట్టె కొంటె పిల్లవాడు
కోపముతో అవ్వ – వేప
చువ్వదీసి రెండు వేయ
నవ్వు విడిచి ఏడ్వబోయె
కొంటె పిల్లడు.

## దర్శనము

స్వామి దర్శనము తప్పక చేదాం
స్వామి పార్శ్వమున లక్ష్మిని చూదాం
నిశ్శబ్దంబుగ మనమున వారలనిడు
కొందాం
నిశ్శేషంబుగ చిత్తము వారల
కర్పింతాం

## నిజము

ఎప్పుడు నిజమును
తప్పక చెప్పిన
ముప్పు కలుగదు
మెప్పు పొందుదువు
సత్పురుషుండని
సభల జెప్పెదరు
కలుగును బొంకున నిష్ఫలము
కలుగును నిజమున సత్ఫలము

## వర్షము

వర్షము కురిసెను
హర్షము కలిగెను
కర్షకులందరు
కదలిరి పనులకు.

## స్నానము

ఒళ్లూ కాళ్లూ
గోళ్లూ చేతులు
ముక్కూ చెవులూ
ముఖమూ అంతా
సబ్బుబిళ్లతో
చక్కగ తోమి
చల్లని నీళ్లను
స్నానమాడితిని
హాయి! హాయి! హాయి!

## చదువు

చదువురాని మొద్దు
కదలలేని ఎద్దు
బద్దకంబు వద్దు
విద్దెబడయ ముద్దు
చదువుగలుగు సుద్దు
చాల విలువకద్దు
బుద్ధి కూర్చు చదువు
అర్థమిచ్చు చదువు
బోధ జేయు చదువు
బాధ దీర్చు చదువు

పోలాకి శ్రీనివాసరావు

---

## 'అహింసా' బోధ

పూర్వం ఒకప్పుడు ఒక అరణ్యంలో సవరుడనే ఒక వేటగాడుండేవాడు. వాడు మంచి బలవంతుడు. ఎంత దూరంలోగల జంతువునైనా గురిచూచి కొట్టగల శక్తికలవాడు.

సవరుడు కేవలం ఆహారంకోసం జంతువును చంపేవాడు కాదు! అవి గిలగిల తన్నుకు చస్తూవుంటే చూచి ఆనందించేవాడు!!

బుద్ధ భగవానుడు సవరుడికి బుద్ధి చెప్పాలనుకున్నాడు.

మర్నాడు బుద్ధుడు అచ్చం సవరుడిలాగే తయారయివచ్చాడు.

సవరుడు, బుద్ధుణ్ణిచూచి 'ఎవరునువ్వు?' అని గద్దించేడు.

'నువ్వెవరివి?' అని ఎదురు ప్రశ్న వేశాడు బుద్ధుడు.

"ఆఁ ...! నాపేరు సవరుడు! నాతో సమానమైన వేటగాడు లేనేలేడు!" అన్నాడు సవరుడు సగర్వంగా.

"నాపేరు సవరుడు! నన్ను జయించగలవాడు లేనేలేడు!" అన్నాడు బుద్ధుడు.

సవరుడు ఆశ్చర్యపోతూ 'ఏమిటి! నువ్వు సవరుడివా? - నా పేరు పెట్టుకున్నావు — అది సరే! నాకొచ్చినవిద్య నీకు వచ్చా?' అని ప్రశ్నించాడు.

"ఓ ...! నాతోరా!" అంటూ బుద్ధుడు సవరుణ్ణి కొంతదూరం తీసుకుపోయాడు. ఒకచోట గుంపులు గుంపులుగా కొన్ని వందల లేళ్ళున్నాయి.

"ఇదో! నీవు ఒక్క బాణంతో ఒక లేడిని మాత్రమే చంపగలవు! నేను ఆ లేళ్ళన్నిటిని చంపుతాను చూడు!" అంటూ గురిచూచి బాణం వదిలాడు బుద్ధుడు.

అది వాయువేగంతోపోయి వరసగా అన్నిటిని చంపేసిందీ!

"ఏమయ్యా! చూశావా! — వెళ్ళు. వెళ్ళి అవి ఎన్ని వున్నాయో లెఖ్ఖపెట్టి, ఒకదాన్ని పట్టుకురా! నీకు సరిపోతుందొకపూటకి!" అని ఆజ్ఞాపించాడు బుద్ధుడు.

సవరుడు 'సరే!' నంటూవెళ్లి అవన్నీ లెఖ్ఖపెట్ట ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది! పోనీ ఒకటి తీసుకుపోదామని ఒక దాన్ని ఎత్తబోయాడు. ఆశ్చర్యం! అది కదిలిందికాదు! ఏనుగుని సయితం ఇట్టే ఎత్తేసే సవరుడీనాడు ఒక్క లేడి నెత్తలేకపోయాడు! సవరుడు "ఈయనెవరో సామాన్యుడుకాడ"ని గబగబాపోయి అతనికి నమస్కరించి "అయ్యా! తమరు సామాన్యులుకారు! నాకీవిద్య ప్రసాదించండి!" అంటూ కోరేడు.

బుద్ధుడు "సరే! నీవు యీ విద్య నేర్చుకోవాలంటే ఒక నెల రోజులు మాంసము తినకూడదు! అసలు హింస తలపెట్టకూడదు! పండ్లు అవీ తింటూ వుండాలి. నేను నెలరోజులయిన తర్వాత వస్తా" నంటూ వెళ్ళిపొయ్యాడు.

సవరుడికి వారంరోజులు కష్టమనిపించింది. కాని తర్వాత మాత్రం పండ్లు తినడానికి అలవాటుపడ్డాడు.

ఒకనాడు అలా ఆలోచిస్తూవుండగా అతనిదివరకు చంపిన జంతువులన్నీ కళ్లల్లో మెదిలాడాయి. "వాటిని, పాపం! చంపి ఎంతపాపం తెచ్చుకున్నానో కదా!" అనుకున్నాడు.

నెలరోజులయిన తర్వాత బుద్ధుడు తిరిగివచ్చాడు. "విద్యచెప్పనా?" అని ప్రశ్నించగానే, యిలా చెప్పాడు బుద్ధుణ్ణిచూచి సవరుడు.

"ప్రభూ! వద్దు! వద్దు! ఒక్క బాణంకు లేడి చొప్పున ఎన్నిటినోచంపి ఎంతో పాపాన్ని పడిగట్టుకున్నా! ఒక్క దెబ్బకి ఎన్నో వందల జంతువులను చంపి ఇంకా పాపాన్ని సంపాదించమన్నావా!" అన్నాడు.

బుద్ధుడు తన అసలు రూపుతో ప్రత్యక్షమై 'సవరా! ఎల్లకాలం యిలాగేవుండు! లెఖ్ఖలేనన్ని వానిని చంపగలం! కాని వాటిల్లో ఒక్కదాన్ని కూడా బ్రతికించలేము! అలాంటప్పుడు మనకి వాటిని చంపటానికి హక్కులేదు! — దేవుడు బ్రతికించగల శక్తిగలవాడు కాబట్టి ఆయన చంపవచ్చు' అంటూ బోధించాడు.

సవరుడు బుద్ధుడికి నమస్కరించి జీవహింస మానేసి హాయిగా వున్నాడు.

పిల్లా సుబ్బారావుశాస్త్రి

# సంపాదకీయములు

## మార్గరెట్ కజిన్స్‌సతి నిర్యాణం

మన దేశంలో మహిళాపురోభివృద్ధికి, బాలలసుశిక్షణ, శ్రేయస్సు పట్ల అత్యంత శ్రద్ధాసక్తులు చూపుతూ నిర్విరామముగా కృషిచేసిన మార్గరెట్ కజిన్స్‌గారి మరణము భారత నారీలోకానికి, ప్రజాసేవకులకు తీరని విచారంకలిగిస్తుంది.

విదేశీయురాలయినా ఆమె మనదేశానికి వచ్చిన నాటినుండి ఆనాటి భారతమహిళల దీనావస్థను చూచి సానుభూతితో వారి పురోభివృద్ధికి కంకణము కట్టుకొని మహిళా ఉద్యమ వ్యాప్తికి విశేషంగా కృషి చేసింది.

ఆమెలో పొంగిపొరలే ఉత్సాహం ఆమె కార్యదీక్షను అమోఘంగా తోడ్పడేది. స్త్రీలకు ఓటింగ్ అధికారముండాలని మాంటేగు వద్దకు వెళ్లిన మహిళారాయబారవర్గానికి నాయకత్వము వహించింది.

విద్యావేత్తగా భారతీయ మహిళలస్థితిగతులను, సంగీత ప్రభావాలను గురించి గ్రంథాలు రచించింది. అనేక విద్యాసంస్థలలో పనిచేసి బాలబాలికల విద్యాబోధనపట్ల అత్యంత శ్రద్ధాసక్తులుచూపింది. అనేక సంస్థల స్థాపనను ప్రోత్సహించింది. ఢిల్లీలోని లేడీ ఇర్విన్ డొమెస్టిక్ కళాశాల స్థాపనకు యీమెకృషి అపారంగా నుపకరించింది.

విదేశీయులలో, జాతీయసమరంలో పాల్గొనినవారిలో కజిన్స్‌సతియొకరు. 1932–33 సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని 1 సం. కారాగారశిక్ష అనుభవించారు. 1949 సం. రాజకీయ బాధితురాలుగా ఆమెకు మద్రాసు ప్రభుత్వము రు 5000/లు యిచ్చింది.

బహునైపుణ్యంతో పియానో వాయించేది. జాతీయ విద్యావిధానంలో సంగీత ప్రాముఖ్యత పెరుగుటకు ఆమెచేసినకృషి అపారము.

అంతర్జాతీయ రంగంలో ఆమె భారత మహిళాభ్యుదయాన్ని గురించి, భారతజాతీయ విశిష్టతను గురించి చేసిన ప్రచారము అత్యధికము.

విమెన్స్ ఇండియన్ అసోసియేషనుకు 1920 లో సంయుక్త కార్యదర్శిని. ఆమె ప్రథమ అఖిల భారత మహిళాసభను 1926-లోను, తర్వాత అఖిల ఆసియా మహిళాసభల ఏర్పాటులు నేటి మహిళా ఉద్యమవ్యాప్తికి కారణాలు. ఆ నిర్విరామ ప్రజాసేవ ఫలితంగా పరలోకంలో భగవంతుడీ ఈమెకు పరిపూర్ణ శాంతిని ప్రసాదించుగాక!

## శ్రీ విజయనామ సం॥ర ఫాల్గుణ–శ్రీ జయనామ సం॥ర చైత్రమాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ మార్చి నెల | 16 | మం | ద్వా 18-59 ఆశ్రే 37-19 ది 8-5 త్యా 4-11 త్రయోదశీతిధిః |
| | 17 | బు | త్ర 20-40 మఘ 40-57 ది 9-8 త్యా 4-15 శూన్యతిథిః |
| | 18 | గు | చతు 23 39 పూఫ 45-41 ది 2-3 త్యా 4-17 చతుర్థితిథిః |
| | 19 | శు | ○ పూ 22-28 ఉఫ 51-2 ది 4-17 త్యా 4·21 |
| | 20 | శ | బహుళపాడ్యమి 31·50 హ 56-44 ది 14-2 త్యా 4-23 |
| | 21 | ఆ | విదియ 36-28 చి 60-10 ది 18-46 త్యా 4-24 |
| | 22 | సో | తదియ 41-10 చి 2-50 ది 18-14 త్యా 4 24 |
| | 23 | మం | చ 45·34 స్వా 8-50 ది 24-8 త్యా 4-22 |
| | 24 | బు | పం 49. 30 విశా 14-24 ది 25-1 త్యా 4-20 |
| | 25 | గు | ష 52-38 అనూ 19-21 రా 4-14 త్యా 4 16 |
| | 26 | శు | స 54-56 జ్యే 23-28 రా 14-14 త్యా 4-12 |
| | 27 | శ | అ 55-42 మూ 26·33 ది 22-21 త్యా 4-12 |
| | 28 | ఆ | న 55·34 పూషా 28-39 రా 18 31 త్యా 4-3 |
| | 29 | సో | ద 54-7 ఉషా 29-15 వ 24-50 రా 8-46 త్యా 3-58 |
| | 30 | మం | ఏ 51-41 శ్ర 28-46 రా 8-4 త్యా 3·54 స్మార్త ఏకాదశి |
| | 31 | బు | ద్వా 47-38 ధ 27-10 రా 13-55 త్యా 3-50 వైష్ణవైకాదశి |
| | 1 | గు | త్ర 42-51 శత 24-33 రా 9-7 వరా 9-49 మొ 11-19 |
| | 2 | శు | చతు 38-20 పూభా 21-5 రా 12-57 త్యా 3-44 |
| | 3 | శ | ● అమా 31-17 ఉభా 17-4 త్యా 3-42 |
| | | | **శ్రీ జయనామ సంవత్సర చైత్రమాసము** |
| 1954 సం॥ ఏప్రిల్ నెల | 4 | ఆ | శుద్ధపాడ్యమి అ 24-52 రా 28-2 త్యా 3-41 అభ్యంగనస్నానం, నింబకుసుమ [భక్షణం, పంచాంగ శ్రవణం |
| | 5 | సో | విదియ 18-4 అశ్వ 7-39 శేష 2-5 తిధిద్వయం |
| | 6 | మం | తదియ 11-52 భ 3-15 కృత్తి సౌభాగ్య గౌరివ్రతం |
| | 7 | బు | చ 6-9 రో 55-51 రా 6-14 |
| | 8 | గు | పం 1-10 ఏష్యం 55 39 మృగ 53-33 |
| | 9 | శు | స 53-49 ఆర్ద్రా 52-21 దివి 14-2 |
| | 10 | శ | అ 52-11 పున 52-19 ది 22-15 |
| | 11 | ఆ | న 51-43 పుష్య 53-31 శ్రీరామనవమి |
| | 12 | సో | ద 52-29 ఆశ్రే 55-55 ధర్మరాజదశమి |
| | 13 | మం | ఏ 54-22 మ 59-25 దివి 27-45 స్మార్తైకాదశి |
| | 14 | బు | ద్వా 57-18 పూఫ 60-10 దివి 20-55 మధ్వ వైష్ణవేకాదశి |
| | 15 | గు | త్ర 60-10 పూఫ 47-7 దివి 23-44 అనంగత్రయోదశి. |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari: Ag. Editor : C. C. Punniah.

# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యాభ్యాసంగము ఉద్యోగ ధర్మములు చాలవగకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, దుర్వ్యసనములు, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱుచుకొని గుల్మము, కడుపుబ్బరము. మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైన వ్యాధు...
కడగనుండు తలనొప్పి...
అరి... కను
వీటిని...

...తొలగి ప్రమేహ రోగములను కుమ...
విరుచుమూలికలు చేరియున్నవి గనుక,
కాలులవల్లను, రసగంధక, పాషాణాది విషద్ర...
దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశల యందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.

'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునటుగను తయారు చేయబడినది.

12 ఔ॥ బుడ్డి రు. 4-4-0

6 ఔ॥ బుడ్డి రు. 2-4-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెలుగుజిల్లాలకు. నైజామునకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్స్, బెజవాడ – సికిందరాబాదు

